## జీవనరేఖలు

| | | |
|---|---|---|
| పేరు | : | **నమిలికొండ బాలకిషన్‌రావు** |
| జననం | : | 06-09-1950, పూడూరు, కరీంనగర్ జిల్లా |
| తల్లిదండ్రులు | : | శ్రీమతి రత్నాబాయి, శ్రీనారాయణరావు |
| విద్యార్హతలు | : | యం.ఏ., యల్.యల్.బి. |
| వృత్తి | : | అడ్వకేట్ |
| సహధర్మచారణి | : | శ్రీమతి గోకులరాణి |
| సంతానం | : | శ్రీమతి కవితాభరద్వాజ్, డా॥ పాంచాలరాయ్ హరిత |
| రచనలు | : | యువస్వరం (కవితాసంపుటి) 1981 |
| | | అక్షరచిత్రాలు (సాహితీ మిత్రులపై కవితా చిత్రాలు) 1986 |
| | | శాంతి-సమత (కవితాసంపుటి) 1989 |
| | | అక్షరాల్లో అనంతం (కవితా సంపుటి) 1990 |
| సంపాదకుడు | : | ప్రసారిక (ఆధునిక సాహిత్యవేదిక) మాసపత్రిక 1982 నుండి |
| | | మావిరసం (కవితా సంకలనం) 1990 |
| | | "నివాళి" కాళోజి రామేశ్వరరావుగారి స్మృతి సంచిక, 1997 |
| | | సుక్కపొడుపు (ప్రసారిక ప్రత్యేక సంచిక) 2002 |
| | : | అధ్యక్షుడు, సాహితీ సమితి, వరంగల్లు అనేక సంస్థలలో భాగస్వామ్యం |
| | : | "యువస్వరం" కవితా సంపుటిపై 12గురు రాసిన వ్యాసాల సమాహారం "నమిలికొండ బాలికిషన్‌రావు - కవితాదర్పణం" - టి. శ్రీరంగస్వామి సంపాదకత్వంలో |
| | : | "శాంతి-సమత" పేరుతో అనువాదం చేసినారు. |
| | : | కొన్ని కవితలు శ్రీ షరీఫ్ ఇమామ్ గారిచే ఉర్దూలోకి అనువాదం. |
| చిరునామా | : | ఇ.నెం. 6-7-61, రాగన్నదర్వాజ, హన్మకొండ, వరంగల్లు - 506 011 ఫోన్: 2447407. |

అశోకప్రెస్, వరంగల్. ఫోన్ : 0870-2427404

# అక్షర ప్రతిబింబం

అక్షర ప్రతిబింబం
అక్షర ప్రతిబింబం
అక్షర ప్రతిబింబం
అక్షర ప్రతిబింబం
అక్షర ప్రతిబింబం
అక్షర ప్రతిబింబం
అక్షర ప్రతిబింబం
అక్షర ప్రతిబింబం
అక్షర ప్రతిబింబం

నమిలికొండ బాలకిషన్‌రావు

# అక్షర ప్రతిబింబం

(పుస్తక పరిచయ వ్యాస సంపుటి)

నమిలికొండ బాలకిషన్‌రావు

యం.ఏ., యల్‌యల్.బి.

ప్రసారిక

(ఆధునిక సాహిత్య వేదిక)

ఇం.నెం. 6-7-61, రాగన్నదర్వాజ

హన్మకొండ, వరంగల్లు - 506 011

2006

AKSHARA PRATHIBIMBAM

*(Commentry on Literary works of different authors)*

by

**Namilikonda Balakishan Rao,** M.A., LL.B.

Prasarika Publication-5



Price Rs.: 35-00

For copies:
**"PRASARIKA"** Monthly
# 6-7-61, Raganna Darwaza
Hanamkonda, WARANGAL - 506 011
Phone No. 0870-2447407

Vishalandhra Publishing House, Hyderabad,
its branches

Printed at:
Ashoka Krishna Offset Printers
Beside Radhika Theatre
Warangal-506 002
Phone: 0870-2427404

## అంకితం



డా॥ టి. శ్రీరంగస్వామి

స్వీకారానికి స్వాగతించిన
విశాల హృదయానికి
నా అక్షర ప్రతిబింబం
సర్వదా అంకితం

ముప్పది వసంతాలు శ్రీరంగస్వామి సాహచర్యంలో
మువ్వన్నెల నా సాహితీ ప్రయాణం.

మన సంగడికి ప్రతిబింబం
ఈ చిరుకానుక

- నమిలికొండ బాలకిషన్‌రావు

ముప్పదేళ్ళుగా సాహితీ ప్రపంచంలో
ఏకభావనతో పరస్పర సౌహృదిని
పంచుకుంటూ ఆత్మీయంగా అందించిన
మీ కృతిని సవినయంగా
అందుకుంటున్నాను.

– టి. శ్రీరంగస్వామి

# అక్షరాల వెనుక.....

ఏ సాహిత్య ప్రక్రియ చూసిన, వివిధ కోణాలు పాఠకులకు దగ్గరయ్యే మార్గం సూచించాలి, అలాంటి ప్రక్రియ కవిత్వం. కవిత్వంలోని పలు అంశాలపై సమగ్ర విశ్లేషణం, సమీక్షాలోచనం, ఆ సమీక్ష వీక్షణ ప్రక్రియ – కవిని, పాఠకున్ని దగ్గరకు చేర్చి వాటి కవిత్వ గుణాలను చూపించేది. దర్పణం లాంటిది. ఆలాంటి ప్రక్రియను కొన్ని పత్రికలు సాహిత్య విలువలను పోషిస్తూ, కవిత్వం సాహిత్యం, సమీక్షలు, విరివిగా ప్రచురించి ప్రముఖ స్థానాన్ని నిలుపుకొంటున్నాయి, కొన్ని పత్రికలు, సాహిత్య విలువలను దిగజారుస్తు వ్యాపార దృష్టిగా నడుస్తున్నాయి, అలా కాకుండా, కవిత్వానికి జీవంపోస్తు సాహిత్య కృషిలో సముద్రంలో ఒక్క నీటిబొట్టులా నా వంతు ప్రయత్నంగా, భాగంగా ఈ సమీక్ష వ్యాస సంపుటి అందిస్తున్నాను.

ఇందులో కొన్ని వ్యాసాలు ప్రసారికలో వెలువడినవి. మరికొన్ని నేరుగా ఈ పుస్తకంలోనే వస్తున్నవి. ఈ పుస్తకం రచయితల యొక్క అంతరార్థాన్ని అందించడంతో పాటుగా, పాఠకుల సౌలభ్యంగా ఎంతవరకు కృతకృత్యులము అయినామనేది పాఠకులకే వదిలి వేస్తున్నాను.

సమీక్షల పుస్తకంగా రూపొందుకోవడం అరుదుగా జరుగుతుంది. ప్రసారిక ప్రచురణల్లో ఇది రెండవది.

ఈ కృతి వెనుక "నవభారత సాహిత్యరత్న" డా॥ టి. శ్రీరంగస్వామి గారి ప్రోత్సాహం, సూచనలు ఉన్నాయి.

ఈ సమీక్షా వ్యాససంపుటికి తమ అమూల్యాభిప్రాయాలను అందించిన ఆచార్య ఎస్. గంగప్ప, ఆచార్య టి. గౌరీశంకర్, డా. వి. వీరాచారి గార్లకు నా కృతజ్ఞతలు.

ఈ పుస్తక ప్రచురణను అందంగా సకాలంలో అందించిన శ్రీ నాగుల యుగంధర్ అశోక్‌కృష్ణ ఆఫ్‌సెట్ ప్రింటర్స్ గారికి కృతజ్ఞతలు.

– నమిలికొండ బాలకిషన్‌రావు

# అభినందన చందనం

వృత్తిపరంగా పరిశీలిస్తే న్యాయవాదులు. కానీ, ప్రవృత్తిపరంగా చూడగా సాహితీమూర్తులు. కవిగా ఎదిగిన నమిలికొండ బాలకిషన్‌రావు గారు సాహిత్య సేవలో నిమగ్నులు కావడం మెచ్చదగ్గ అంశం. పత్రికా సంపాదకత్వం అనేది వారి సాహితీమూర్తి కిరీటంలోని కలికితురాయి. అనేక గ్రంథాలను తన సంపాదకత్వంలో వెలువరించారు. సమీక్షా వ్యాసాలలో విమర్శనారంగంలోను తన సామర్థ్యాన్ని ప్రకటించు కొంటున్నారు. అభినందనీయులు బాలకిషన్‌రావుగారు.

1950లో జన్మించిన బాలకిషన్‌రావు గారు అడ్వకేట్‌గా జీవితం సాగిస్తూనే సాహిత్యాన్ని ఆరోప్రాణంగా భావించి తదభ్యున్నతికి ఎంతో సేవచేస్తున్నారు. వరంగల్లు సాహితీసమితి అధ్యక్షులుగా ఇంకా ఎన్నో సంస్థల భాగస్వామ్యంతో చేస్తున్న సాహిత్య సేవ ప్రశంసనీయం. 1981లో 'యువస్వరం' కవితా సంపుటితో ప్రారంభించిన కవితా వ్యవసాయం అక్షర చిత్రాలు, శాంతి-సమత, అక్షరాల్లో అనంతం - అనే కవితా సంపుటాలతో ఆ మార్గంలో ఎన్నో ఎత్తులకు ఎదిగారు. పై పెచ్చు 'శాంతి-సమత'ను హిందీలోకి అనువదించి హిందీ భాషాభాషీయులకు తెలుగు కవితల రుచి చూపించారు. అలాగే వీరి కొన్ని కవితలను శ్రీషరీఫ్ ఇమామ్ గారు ఉర్దూలోకి అనువదించి ఆ భాషా సాహితీప్రియులకు బాలకిషన్‌రావుగారి కవితలను తెలుపడానికి చేసిన ప్రయత్నం మంచిదే. ప్రస్తుతం ప్రసారిక సంపాదకత్వంలో పత్రికా సంపాదకుడుగా కూడా ఎదిగారు. ఇంకా మావిరసం, నివాళి మొదలైన గ్రంథాల సంపాదకత్వం వల్ల వాటి గౌరవం పెరిగింది.

ప్రస్తుతం బాలకిషన్‌రావుగారి సృజనతో పాటు ఈ సమీక్షల మూలంగా విమర్శకుడుగా ఎదిగిన తీరు స్పష్టం అవుతుంది. ఈ సంపుటిలో ఇరవైరెండు సమీక్షలున్నాయి. ఇందులో కొన్ని బాలకిషన్‌రావు గారి కలం బొమ్మలు (Pen Pictures) బాగున్నాయి. చెప్పేతీరులో, చెప్పిన విశేషాలలో బాలకిషన్‌రావు గారి విమర్శనాత్మకదృష్టి స్పష్టం. సమీక్ష అనగానే నాలుగు మాటలు చెప్పితే చాలనుకోవడం కాదు. ఆ కవిత, ఆ వ్యాసం, ఆ వ్యక్తి తత్త్వంలోని కేంద్రబిందువును వివరిస్తూ స్పష్టంగా, సహృదయ తీరును ప్రకటిస్తూ వివరిస్తూ విశ్లేషించే తీరు ఆయా గ్రంథాలను పాఠకులు చదివేలా చేయడంలో



బాలకిషన్‌రావు గారు కృతకృత్యులయ్యారు. ఎత్తుగడ, వివరణ, విశేషాలను వివరించడంలో వారి రచనా వ్యూహం స్పష్టమవుతుంది. వీటిలో సుమారు ఏడు పెద్ద సమీక్షలున్నాయి. చలం సాహిత్యం గురించి, లల్లాదేవి కాశ్మీరీ కవితల గురించి, హనుమారెడ్డి 'చంద్రిక' గూర్చి, అమృతలత అమృతవాక్కుల గురించి, గంగప్ప జ్ఞానపీఠి గూర్చి పరిశీలిస్తే పైన నేను పేర్కొన్న అంశాలు విదితమై బాలకిషన్‌రావు సూక్ష్మ పరిశీలన విస్పష్టమవుతుంది. ఇలాంటి మంచి సమీక్షలు చేసి వాటిని సంపుటీకరించి మరో సాహితీవేత్త, మిత్రులు డా॥ టి. శ్రీరంగస్వామి గారికి అంకితమివ్వడం ప్రశంసనీయం. ఇస్తున్న శ్రీ బాలకిషన్‌రావు గారికి, స్వీకరిస్తున్న డా॥ టి. శ్రీరంగస్వామి గారికి నా హార్దికాభినందనలు.

- ఆచార్య ఎస్. గంగప్ప

సుధర్మ
సి-75, శ్రీనివాసనగర్
గుంటూరు - 522 006

# గీటురాయి

సాహిత్యాధ్యయనం వేరు, సాహిత్య విమర్శనం వేరు. సాహిత్యాధ్యయనం చేసే ప్రతివారూ సాహిత్య విమర్శనం, అందునా సద్విమర్శనం చేయలేరు. సాహిత్యాధ్యయనం అన్నది అభిరుచికి సంబంధించినది. సాహిత్య విమర్శనం అన్నది విశ్లేషణతో కూడిన అభివ్యక్తికి సంబంధించినది. చదవడం వేరు, చదివినదానిని బేరీజు వేసి విలువ కట్టడం వేరు. మొదటిది అందరూ చేసేదే, కానీ రెండవది ఏ కొందరు మాత్రమే చేస్తారు. ఆ కొందరి కోవకు చెందినవారు నమిలికొండ బాలకిషన్‌రావు గారు.

రాయడం సృజనాత్మకత అయితే, ఆ రాసినదాని గుణగణాలను అనేక కోణాల నుంచి ఆవిష్కరించి చూపడం ఆలోచనాత్మకం. ఈ చూపడంలో నైపుణ్యం కనబరిస్తే అది ఆలోచనామృతం. రాయడానికి ఊహ కావాలి, దానిని అనుశీలించడానికి ఉపజ్ఞ కావాలి. రాయడానికి, చదవడానికి బాహిరమైన లేక లౌకికమైన దృష్టి ఉంటే సరిపోతుంది. కానీ దానిని సదసద్వివేచన చేయడానికి వివేకం, అంతర్దృష్టి, లోచూపు కావాలి. అదే కవి లేక రచయితకు, విమర్శకునికి మధ్య ఉన్న తేడా. కవికి రాసేటప్పుడు తట్టని, ఊహించని అంశాలెన్నో విమర్శకునికి దానిని విమర్శించేటప్పుడు ఎన్నెన్నో వన్నెలు దృగ్గోచరమవుతాయి. అందుకే కప్పి చెప్పేది కవిత్వం, విప్పి చెప్పేది విమర్శ అని అన్నారు.

నిత్య సాహిత్యవ్రతునిగా, కవిగా, రచయితగా, కార్యకర్తగా, పత్రికా సంపాదకునిగా లోకానికి సుపరిచితులైన బాలకిషన్‌రావు గారు ఈ పుస్తకంతో మంచి వ్యాసకర్తగా, విమర్శకునిగా మనకు దర్శనమిస్తున్నారు. ఆయన సమకాలీన తెలుగు సాహిత్యాన్ని ఎంత నిశితంగా పరిశీలిస్తున్నారో దీనిలో ఆయన రాసిన వ్యాసతుల్యమైన విమర్శల ద్వారా మనకు స్పష్టమతుంది. దీనిలో మొత్తం 22 విమర్శనాత్మకమైన వ్యాసాలున్నాయి. వీటిలో కొన్ని వ్యాసాలు 'ప్రసారిక' పత్రికలో అచ్చయితే, ఒక వ్యాసం 'భావవీణ'లో ముద్రితమైంది. మిగతావి అముద్రితాలు.

ఈ సంకలనంలో మొదటి వ్యాసం డా. ఈదారెడ్డిగారు 'చలం సాహిత్యంలో స్త్రీ' అన్న అంశంపై రచించిన పిహె.డి. సిద్ధాంత గ్రంథానికి చెందినది. "పాశ్చాత్య దేశాల్లో స్త్రీవాదం అనేది బలంగా వేళ్ళూనకముందే ఆంధ్రదేశంలో చలం స్త్రీ స్వేచ్ఛను



కోరుతూ, స్త్రీవాదాన్ని ఒక ఉద్యమంగా ముందుకు తెచ్చినవాడు. స్త్రీల పక్షాన నిలబడి ఒంటరి పోరాటం చేసినవాడు చలం" అన్న స్టేట్‌మెంట్ ఎంత వాస్తవమైనదో అంత బలమైనది కూడా. ఈదారెడ్డి గారి సిద్ధాంత వ్యాసాన్ని పరామర్శించే నెపంతో నమిలికొండ వారు చలం యొక్క మూర్తిమత్వాన్నీ, సాహితీ వ్యక్తిత్వాన్నీ, భావజాలాన్నీ వడకట్టి పోతపోశారు. జయలాల్‌కౌల్ 'లల్లేశ్వరీ వాక్కులు' కాశ్మీరీ భాషలో రచించిన దానిని డా. వి.వి.బి. రామారావు తెనిగించారు. దీనిలో లల్లాదేవి వాక్కులు 138 ఉన్నాయి. ఈ అనువాద గ్రంథాన్ని బాలకిషన్‌రావుగారు లోతుగా అనుశీలించారు. లల్లాదేవి జీవితరేఖలను స్పృశిస్తూనే ఆమె నిశ్చలభక్తి తత్పరతను, ఆత్మ పరమాత్మల అలౌకిక వాదాన్ని, ఆధ్యాత్మిక తత్త్వాన్ని, మధురభక్తి ఛాయలను కూడా తెలియచేశారు. 100 పైసల తెలంగాణా కవి అన్నవరం దేవేందర్ 'మంకమ్మతోట లేబర్ అడ్డా'లోని కవిత్వాన్ని స్థాలీపులాకన్యాయంగా సమీక్షించారు. "పల్లె తరుముతే పక్షులన్నీ అడ్డమీద వాలాయి" అన్న దేవేందర్ పంక్తులు ఈనాటి అక్కడి వాస్తవిక పరిస్థితికి చిత్రిక పడుతున్నాయని బాలకిషన్‌రావుగారు అనడం రచయిత పక్షాన వకాల్తా పుచ్చుకోవడం. ఇంకా వీరు డా. మసన చెన్నప్ప 'నానీలు' గురించి రాస్తూ నానీలు రాయడం 'కవిత్వం మేడ్ ఈజీ' అని భ్రమపడుతున్నారు కొందరు. కానీ మంచి నానీ, అసలు సిసలైన నానీ రాయడం అంత సులభమేమీ కాదు అన్న నమిలికొండవారి తీర్పు ఆమోదయోగ్యమైందే. 'జ్ఞానపీఠి గంగప్ప' వ్యాసంలో గంగప్ప ఒక అలుపెరుగని, అవిశ్రాంత సాహితీయోధుడు అనడం సాభిప్రాయ ప్రయోగం. సాహితీ ప్రక్రియలన్నింటిలో పుంఖానుపుంఖంగా రచనలు చేసిన బహుముఖీన ప్రజ్ఞాశాలి ఆచార్య గంగప్పగారు జ్ఞానపీఠాన్ని అధివసించడానికి అన్ని విధాలా అర్హత కలిగినవారన్న బాలకిషన్‌గారి అభిప్రాయం ఈ వ్యాస శీర్షికను బట్టి అభివ్యక్తమవుతోంది. గంగప్పగారి వైదుష్యానికి వారి 'తెలుగు నాటకం – సామాజిక చైతన్యం' అన్న తెలుగు, ఇంగ్లీషు భాషలలోని వారి గ్రంథమే నికషోపలమని వీరు తేల్చి చెప్పారు. 'ఎస్వీ తస్వీరం'లో ఎస్వీ సత్యనారాయణగారి కవిత్వంలోని ఉద్యమ స్ఫూర్తినీ, ప్రగతిశీల దృక్పథాన్నీ, వాడినీ, వేడినీ నాడిలా పట్టుకొని నలుగురికీ తెలియచెప్పారు నమిలికొండవారు. ఇక హనుమారెడ్డిగారి 'చంద్రిక' కవితా కదంబాన్ని వెన్నెలపూవుగా అభివర్ణిస్తూ కవికి కన్ను, చెవి – ఇంద్రియాలు చాలా ముఖ్యమనీ కవిలోని 'క' కనుటకు అంటే చూడడానికీ 'వి' వినుటకూ మూలమైనవని తెలియచెప్పారు. కని అంటే చూసిన దానినీ, చెవులతో విన్నదానినీ కవిత్వీకరిస్తేనే అది నికార్సైన కవిత్వం అనిపించు కుంటుందన్నది బాలకిషన్‌గారి అభిప్రాయం. 'రత్నంలాంటి కవిత'లో ఉప్పలపాటి వెంకటరత్నం (యు.వి. రత్నం) కవిత్వాన్ని సమీక్షిస్తూ, కవిలోని భావనలకు నూతన

భాష్యం చెప్పడం జరిగింది. కొల్లేటి సరస్సు దయనీయస్థితి వస్తువుగా శ్రీ ఎస్. ఆర్. భల్లం రచించిన 'కొల్లేరు కావ్యాత్మ'ను బాలకిషన్‌గారు ఆవిష్కరిస్తూ, శుష్కమైన నినాదాలు కాకుండా వాస్తవికతతో కూడిన అక్షరాలలో కవితాత్మ తొణికిసలాడుతుందనీ, ఏ అక్షరాన్ని పట్టి పిండినా దోసిళ్ళ నిండా కవిత్వాన్ని ఒడిసి పట్టుకోవచ్చునని తెలుపుతూ దానిని పఠితల కళ్ళ వాకిళ్ళముందు పరిచే ప్రయత్నం చేశారు నమిలికొండవారు.

ఆచార్య మాదిరాజు రంగారావు కావ్యం 'సృజన దర్శనాన్ని' నమిలికొండవారు స్పర్శించిన తీరు పరమాద్భుతంగా ఉంది. మనిషిలోని అస్తిత్వానికి సృజనశక్తి బీజం. ఇది కవిలో ఒక భూజమై నిత్య వసంతంతో కళకళలాడుతున్నంతకాలం కవి సజీవంగా ఉంటాడన్నది నగ్న సత్యం. పూవును నలిపివేస్తే ఫలరూపం సిద్ధించదు, వేరును నరికివేస్తే చెట్టుకు రూపం ఉండదు. అందుకే పూవును పరిమళించనివ్వాలి. చెట్టును శాఖోప శాఖలుగా విస్తరింపనివ్వాలి. భూమిపై మనిషి జీవించి ఉన్నంతవరకు ఇవి నిత్యచైతన్యంతో ఉండాలన్న మాదిరాజుగారి భావసాంద్రతను, కవితా కాసారంలోని సారాన్ని పిండి కాచి వడబోశారు నమిలికొండవారు. వెంకటయ్యగారి 'మట్టి పరిమళా'న్ని ఆఘ్రాణిస్తూ కవి ప్రకృతిని కావ్య వస్తువుగా మలుచుకున్నప్పుడు సామాజిక ప్రయోజనాన్ని సాధిస్తాడని ఘంటాపథంగా చెప్పారు వ్యాసకర్త. దీనిలోని 'నాన్న' కవిత బాలకిషన్‌రావుగారిని బాగా కదిలించినట్లుంది. అందుకే కవి ఆర్ద్ర హృదయాన్ని గమనించి, గ్రహించి అందించ గలిగారు. బాలకిషన్‌రావుగారి అభిప్రాయంలో కవి ఎప్పుడూ పీడితుల పక్షాన ఉండాలి, వాళ్ళలో చైతన్యాన్ని ఉద్దీపింప చేయడానికే కవిత్వం రాయాలి. ఈ అభిప్రాయం వెంకటయ్యగారి ఈ కావ్యంలో అక్షర రూపాన్ని సంతరించుకుందన్న సంతోషం, సంతృప్తి బాలకిషన్‌గారి ఈ సమీక్షా వ్యాసంలో సాక్షాత్కరిస్తుంది. ఇక సంగివేని రవీంద్ర 'అన్వేషణ' కావ్య హృదయాన్ని ఆవిష్కరిస్తూ, ఈనాడు ప్రపంచ కవులందరూ సామాజిక చిత్రణను, సామాజిక చైతన్యాన్ని, సామాజిక స్పృహను గుర్తించారనీ, ఆ చైతన్యలక్షణం రవి 'అన్వేషణ'లో కనిపించిన వైనాన్ని బాలకిషన్‌రావుగారు ఎంతో వైవిధ్యంగా వ్యాఖ్యానించారు. అంతేకాదు ఆవేశం వస్తేనే కానీ కవిత్వం రాదు, ఆవేశంలో రాసిందంతా కవిత్వం కాదు అన్న వీరి మాటలు ఎంతో వాస్తవమైనవి. రవిలోని కవికి సామాజిక కవిత్వమే కాదు, భావ కవిత్వం, ప్రేమ కవిత్వం, ప్రకృతి కవిత్వం, ఆత్మాశ్రయ కవిత్వం కూడా చెప్పడం తెలుసు అన్నమాటను నమిలికొండవారు మరీ నొక్కి చెప్పారు. బాలకృష్ణారెడ్డిగారి గీతాలను ప్రస్తావిస్తూ 'మల్లెల దారులే సాధ్యంకాదని, పల్లేరుల దారులే ఎక్కువని' గ్రహించి దానిని కవి లోకానికి చెప్పడానికి గుండె ధైర్యం కావాలని, అటువంటి



ధైర్యం కలిగిన బాలక్రిష్ణారెడ్డిగారిని బాలకిషన్‌రావుగారు అభినందించారు. అద్దంకి జ్యోతిష్మతి కవిత్వంలోని ఆత్మీయ స్పర్శను అనుభూతి చెంది దానిని మనకు విద్యుత్ ప్రవాహంలా అందించారు. వ్యాసకర్త. అదే విధంగా అమృతలతగారి 'అమృత వాక్కులు'లోని అజరామరత్వాన్ని పరిశీలించి చూపారు. రేగులపాటి కిషన్‌రావుగారి 'పావురం' రెక్కలార్చుకుని ఎగిరే వైనాన్నీ' వారి కవనశక్తినీ బేరీజువేసి చూపారు బాలకిషన్‌రావుగారు. బుద్ధుని జీవితాన్ని గురించి చెపుతూ, ఆంధ్రదేశంలో పరిఢవిల్లిన బౌద్ధమత వైభవ చిహ్నాలను కళ్ళకు కట్టి చూపించారు. ఇది ఇటీవల ఆంధ్రప్రదేశ్ గుంటూరు జిల్లాలోని అమరావతి వద్ద జరిగిన 'కాలచక్ర' సందర్భం కోసం రాసిన సమాచార, పరిశోధనాత్మక వ్యాసం. దీనిలో బాలకిషన్‌రావు గారికి బౌద్ధంపట్ల ఉన్న అభినివేశం వ్యక్తమవుతుంది.

ఈ రకంగా ఈ వ్యాస సంపుటి శ్రీ నమిలికొండ బాలకిషన్‌రావుగారి పరిశీలనా పాటవానికి గీటురాయిగా రూపుదాల్చింది. ఇంత చక్కటి ప్రయత్నం చేసిన బాలకిషన్‌రావు గారిని మనస్ఫూర్తిగా అభినందిస్తూ వారి ఈ కృషి మున్ముందు మరింత ముమ్మరం కావాలని ఆకాంక్షిస్తున్నాను.

**- ఆచార్య టి. గౌరీశంకర్**

ఇం.నెం. 1-1-217
వివేక్‌నగర్, చిక్కడపల్లి
హైద్రాబాదు - 500 020

# సృష్టి - దృష్టి

వ్యాసం అంటే విభజించటం అని అర్థం. రచయిత తాను చెప్పదలచుకున్న భావం చెడకుండా విషయాన్ని విభాగాలుగా చేసి, సూటిగా, స్పష్టంగా రాయటం వ్యాసంలో ప్రధానాంశం. ఇక్కడ రచయిత తాను ప్రతిపాదింప దలచుకున్న విషయాన్ని కేంద్రంగా చేసుకొని, తానేర్పరచుకున్న ప్రణాళిక ప్రకారం తాను రాయదలచుకున్న విషయాన్ని విశ్లేషిస్తాడు. అయితే విషయ ప్రధాన వ్యాసాలు, వినోద వ్యాసాలు, సామయిక వ్యాసాలు - ఈ మూడింటిలో ఏవ్యాసాన్ని రాయాలనుకుంటున్నామో దాన్ని బట్టి వ్యాసం రాసే పద్ధతుల్లో తేడాలుంటాయి.

సమీక్ష వ్యాసాలు సామయిక వ్యాసాల్లోని రకాల్లో ఒకటి. ఇవి విషయ ప్రధానమైన, విమర్శక, పరిశోధనాత్మక వ్యాసాల్లాగా సీరియస్ వ్యాసాలు కావు. ఆయా కవుల-రచయితల గ్రంథాల్లో నిక్షిప్తమైన విషయాన్ని సమీక్షకుడు ఒక రకంగానూ, విమర్శకుడు మరో విధంగానూ, పరిశోధకుడు ఇంకో రకంగా వెలికితీసి ఆయాకవుల - రచయితల ప్రతిభా పాటవాలను, సామాజిక స్పృహను అంచనా వేస్తారు. ఈ మూడు రకాల వ్యాసాల్లో విస్తృతిలోనూ, విషయ విశ్లేషణలోనూ, సిద్ధాంతీకరించడంలోనూ వైవిధ్యం వుంటుంది.

ఈ దృష్టితో మనం పరిశీలించినప్పుడు నమిలికొండ బాలకిషన్‌రావుగారు రాసిన "అక్షర ప్రతిబింబం" పరిచయ వ్యాస సంపుటిలోని వ్యాసాలు సామయిక వ్యాసాల్లోని సమీక్షా వ్యాసాల కోవలోనికి చెందుతాయి. ఇందులో రచయిత పరిశోధన గ్రంథాలను, అనువాద సాహిత్యాన్ని కవితా సంకలనాలను సమీక్షించిన వ్యాసాలతో పాటు "బుద్ధుని జీవితం-ఒక పరిశీలన" శీర్షికతో రాసిన విషయ ప్రధానమైన వ్యాసం కూడా ఉంది.

సాధారణంగా పుస్తకాలను మూడు విభాగాల్లో సమీక్షించడం జరుగుతుంది. సమకాలీన సాహిత్య స్వరూప స్వభావాలను గూర్చి కొన్ని మాటలు. గ్రంథ రచయితను గూర్చి కొన్ని మాటలు చెప్పి, గ్రంథంలోని వస్తు, భావ, శిల్పాలను సమీక్షించడం



జరుగుతుంది. అయితే ఆయా సమీక్షకుల దృష్టికోణాన్ని బట్టి ఈ మూడు విభాగాల్లోని విషయ విశ్లేషణ నిష్పత్తుల్లో తేడాలుంటాయి. కొందరు సమీక్షకులు సమకాలీన సాహిత్య స్వరూప, స్వభావాలకు ఎక్కువ ప్రాధాన్యతను ఇచ్చి, తాము సమీక్షిస్తున్న గ్రంథంలోని విషయాన్ని గ్రంథ రచయితను గాలికి వదలి వేస్తారు. మరికొందరు సమీక్షకులు గ్రంథ రచయితను ఆకాశానికి ఎత్తివేసి, గ్రంథాన్ని గూర్చి ఒక్క ముచ్చట కూడా చెప్పరు. ఇది సరైన సమీక్షా విధానంకాదు. నమిలికొండ బాలకిషన్‌రావు గారు ఈ రెండు పద్ధతుల జోలికి పోకుండా ఆయా కవులు - రచయితలు రాసిన గ్రంథాలను దృష్టిలో వుంచుకొని, వాటిల్లో ఆయా కవులు - రచయితలు నిక్షిప్తం చేసిన భావాలను సమ వీక్షణంతో వెలికి తీసే ప్రయత్నం "అక్షర ప్రతిబింబం" పరిచయ వ్యాస సంకలనంలో చేశారు. మచ్చుకు ఈ సంకలనంలోని మొదటి సమీక్షా వ్యాసం "చలం సాహిత్యంలో స్త్రీ తులనాత్మక పరిశోధన-పరిశీలన అనే సమీక్షా వ్యాసాన్ని పరిశీలిద్దాం.

"డా. ఈదారెడ్డి గారు కాకతీయ విశ్వవిద్యాలయంలో దశాబ్దం క్రితం పరిశోధన చేసి డాక్టరేట్ పట్టా పుచ్చుకొన్న సిద్ధాంత గ్రంథం ఇది. పరిశోధనాంశాలను పది అధ్యాయాలుగా వర్గీకరించారు". అంటూ మొదటి పేరాలో "చలం సాహిత్యంలో స్త్రీ" పరిశోధన గ్రంథ రచయితను గూర్చి ఒకే ఒక వాక్యంలో చెప్పి పరిశోధన గ్రంథంలోని అంశాల్లోకి వెళ్ళిపోయాడు. పరిశోధకుడు ఎన్నుకున్న పరిశోధనాంశంలోని విషయాలను విశ్లేస్తూనే, ఆనాటి సమాజంలో 'చలం' సాహిత్యానికి వున్న భూమికను తనదైన దృష్టికోణంలో విశ్లేషించి, అటు సృజనాత్మక సాహిత్య సృష్టిని - పరిశోధకుని దృష్టికి సమవీక్షణ చేయడంలో నమిలికొండ వారు సఫలీకృతులైనారు. అంతేకాదు "చలం మీద పరిశోధన చేసిన మొదటి పరిశోధకుల్లో ఈదారెడ్డి గారి ఈ పరిశోధన చలం సాహిత్యంలో ఉన్న స్త్రీ పురుష సంబంధాలను చర్చిస్తుంది. స్త్రీ సమస్యలను ఆవిష్కరిస్తుంది" అంటూ తాను సమీక్షిస్తున్న పరిశోధన గ్రంథ సారాన్ని తనదైన దృష్టి కోణంలో అంచన వేస్తూ సూటిగా స్పష్టంగా సమీక్షా వ్యాసాన్ని ముగించాడు. ఈ విధమైన సమీక్షలు కవి లేదా రచయితల సృజనాత్మక సృష్టి ఆరోగ్యవంతంగా ఉండడానికి దోహదం చేస్తాయి. ఈ నాటి పత్రికల్లో వచ్చే 'సమీక్షల్లో' ఈ లక్షణం అరుదుగా కన్పిస్తుంది.

ఇకపోతే కొందరు సమీక్షకుల సమీక్షలు పత్రికా విలేఖరుల వార్తల్లాగా వుంటాయి. సభలు, సమావేశాలకు వెళ్ళకుండానే కూర్చున్న చోటునుంచే ఆహ్వాన పత్రాన్ని బట్టి కొందరు విలేఖరులు ఆయా సభల, సమావేశాల రిపోర్టును వార్తగా

రాసేస్తారు. వీళ్ళ దగ్గర శుక్రాచార్యుని దగ్గర వున్న దివ్య దృష్టి ఏమైనా ఉందా? అని సందేహించకండి. స్థలం-కాలం-సందర్భం మారుతాయి. తప్ప ఏ సభలోనైనా ఎవరు మాట్లాడినా "పాడిందే పాదరా పాసుపండ్ల . .. ." అన్నట్లు ఆవే ముచ్చట్లు చెబుతారన్న జగమెరుగని సత్యం పాత్రికేయులకు తెలుసు సుమండి. ఆ మాత్రం విషయానికి అక్కడి దాకా వెళ్ళడం కూడా వృధామేకదా. కాబట్టి ఆహ్వాన పత్రికలను చూసి వార్తలను రాస్తుంటారు. ఒక్కొక్కసారి ఆహ్వాన పత్రికల్లో పేర్కొన్న అధ్యక్షులు, అతిథి దేవుళ్ళు రాకపోయినా వాళ్ళు ఆ సభలో మాట్లాడినట్లు వార్తలు వస్తుంటాయి. గమనించే వుంటారు. ఇది విలేఖరుల ముచ్చట. మరివారితో పోల్చిన సమీక్షకుల మాటేమిటి అన్నది కదా ప్రశ్న.

ఇందులో కూడా పరమ రహస్యం ఏమి లేదు. కొందరు సమీక్షకులు కొన్ని పడికట్టు పదాలతో ఒక మూసపోసుకొని రడీగా వుంటాయి. ఏదైన కొత్త పుస్తకం రాగానే, వీళ్ళను సమీక్షించమని కోరగానే సరి, రచయిత పేరు, గ్రంథం పేరు - ఇలాంటివి ఏవైన మరికొన్ని అంశాలుంటే మార్చేసి ఆ మూసలో ఈ గ్రంథాన్ని వేసేస్తారు. అంతే పుస్తకాన్ని చదవకుండానే క్షణంలో సమీక్షా వ్యాసాన్ని తయారు చేస్తారు. పత్రికలకు పంపుతారు. "నిలయ విద్వాంశులు"గా పత్రికల్లో తమ పేర్లను నమోదు చేసుకుంటారు. ఇది ఈనాటి పుస్తక సమీక్షల-సమీక్షకుల కథాకమామిషు.

బాలకిషన్‌రావు గారి సమీక్షలు ఇందుకు భిన్నంగా వున్నాయి. ఇందులోని సమీక్షలన్నింటిని పరిశీలిస్తే, ఏ సమీక్షకు ఆ సమీక్ష ఒక ప్రత్యేకతను కలిగివుందన్న విషయం స్పష్టమౌతుంది.

"ఎస్వీతస్వీరం" అనే వ్యాసంలో "ఎస్వీ మంచి వక్త. వేదిక లెక్కితే అతని వాగ్ధార ధారాళం. అతన్ని సన్నిహితంగా ఎరిగిన వాడిని కాబట్టి ఆయా సన్నివేశాల్లో అతని సంవేదనను గమనించిన వాడిని" అంటూ ప్రముఖ అభ్యుదయ కవి, విమర్శకుడు, ఎస్వీ సత్యనారాయణ గారి జీవిత-సాహిత్య వ్యక్తిత్వాన్ని చక్కగా అంచనా వేశారు. అదే విధంగా "చంద్రికే" వెన్నెల పువ్వు అనే సమీక్ష వ్యాసంలో "హనుమారెడ్డిగారు న్యాయవాదిగా తర్కనిపుణుడైనా కవితా వేదిగా పరమ భావుకుడు" అంటూ ఒక వ్యక్తి వృత్తి, ప్రవృత్తుల్లోని వైవిధ్యాన్ని చిన్నచిన్న వాక్యాల్లో వ్యక్తీకరించటంలో నమిలికొండ తనకంటూ ఒక ప్రత్యేకతను నిల్పుకున్నారు.

ఇదే వ్యాసంలో చివర సమకాలీన కవుల వ్యక్తిత్వాలను అంచనా వేస్తూ "కొందరు రాజకీయ కవులై కిరీటాలాశిస్తున్నారు. కొందరు వ్యాపార కవులై సింహాసనాలు



కోరుతున్నారు. కొందరు ఆత్మీయులకు పెద్దపీట వేశారు- అంటూ చెబుతూనే "ఏ కాలానికైనా నిలిచి ఉండే మట్టి-మనిషి-మానవీయత, ప్రేమ, ఆత్మీయత తప్ప ఇతర కవితా వస్తు విశేషాలు కొంత కాలానికి ఆయా సామాజిక పరిస్థితులను బట్టి తెరమరగు అవుతున్నాయి" అంటూ నిత్య సత్యాన్ని తన సాహిత్యానుభవ దృష్టికోణంలోంచి నిగ్గుతేల్చి చెప్పారు.

భవిష్యత్తులో నమిలికొండ బాలకిషన్‌రావుగారి కలం నుండి మరిన్ని సమీక్ష వ్యాస సంకలనాలు రావాలని ఆశిద్దాం.

తేది: 6-7-06
హనుమకొండ

- డా. వి. వీరాచారి
ఆంధ్రోపన్యాసకులు
సి.కె.యం. పి.జి. కళాశాల
వరంగల్లు - 506 006

## విషయ సూచిక


1. "చలం సాహిత్యంలో - స్త్రీ" తులనాత్మక పరిశోధన - పరిశీలన ... 17
2. లల్లేశ్వరి వాక్కులు ... 20
3. చక్కని టైటిల్ దస్తావేజు "మంకమ్మతోట లేబర్ అడ్డా" ... 23
4. చెన్నప్ప కలం చెప్పిన "నానీలు" ... 25
5. జ్ఞానపీఠి "గంగప్ప" ... 27
6. "ఎస్వీ తస్వీరం" ... 30
7. "చంద్రికే" వెన్నెల పువ్వు ... 32
8. "రత్నంలాంటి కవిత" ... 35
9. భల్లంగారి కవితాత్మ "కొల్లేరు" ... 37
10. ఆచార్య మాదిరాజు రంగారావు "సృజన దర్శనం" - ఒక పరిశీలన ... 39
11. "మట్టి పరిమళం" - ఒక పరిశీలన ... 40
12. శ్రీసంగినేని రవీంద్ర చిత్రణ - "అన్వేషణ" ... 42
13. బాలుడి పయనం ... 44
14. జ్యోతిష్యం గారి "ఆత్మీయ స్పర్శ" ... 46
15. అమృతలత - "అమృతవాక్కులు" ఒక పరిశీలన ... 48
16. రేగులపాటి - "ఎగిరే పావురం" ... 51
17. బుద్ధుని జీవితం - ఒక పరిశీలన ... 53
18. ఈతకోట సుబ్బారావు అక్షరలిపిలో "హృదయ లిపి" ... 57
19. సాహిత్య సమాలోచనలో "నానీ"ల ఒక కోణం ... 58
20. మానస ఉల్లాసం - సరోవర స్నానం ... 60
21. కవిత్వ క్రీడ "నూట పదహార్లు" డా॥ రావి రంగారావు - సంకల్పం ... 62
22. "కవిత్వధార జమారా ప్రవాహం" ... 65

## "చలం సాహిత్యంలో - స్త్రీ"
## తులనాత్మక పరిశోధన - పరిశీలన

డా॥ ఈదారెడ్డి గారు కాకతీయ విశ్వవిద్యాలయంలో దశాబ్దం క్రితం పరిశోధన చేసి డాక్టరేట్ పట్టా పుచ్చుకొన్న సిద్ధాంతగ్రంథం ఇది. పరిశోధనాంశాలను పది అధ్యాయాలుగా వర్గీకరించారు.

స్త్రీల జీవిత సమస్యలను సంస్కరణోద్యమ పరిమితులనుండి బయటకు తెచ్చినవాడు చలం. స్త్రీ సమస్యను స్త్రీల శరీరానికి, మనస్సుకు, మెదడుకు సంబంధించిన అనుభవపరిధి నుండి సహజమానవీయ దృక్పథంతో, అత్యంత విశ్వసనీయంగా ప్రదర్శించగలిగాడు. తన ప్రయోజనాలకనుగుణంగా స్త్రీని నిర్దేశించటం, నియంత్రించటం మాత్రమే తెలిసిన పురుష ప్రపంచానికి ఈ సమాజం గురించి, పురుష ప్రపంచం గురించి స్త్రీ తనలో తాను ఏమనుకుంటున్నదో, పురుష ప్రపంచాన్ని తిరస్కరించటానికి స్త్రీకి ఎంత అక్కర, అవకాశం వుందో చూపించాడు చలం. ఇది పురుషుల అధికార పీఠం పునాదులను కదిలించిన డైనమేట్ అయింది. కుటుంబ స్త్రీ పురుష సంబంధాలలో ఉత్తమ విలువలను నిలుపుకోలేక పోయిందని నిర్ధారించాడు. విలువలు లేని వ్యవస్థను, స్త్రీకి ఒక విలువ, పురుషుడికి ఒక విలువగా నిర్ణయించిన ద్వంద్వ విలువల వ్యవస్థను చలం సహించలేకపోయాడు. విలువలు కలిగిన నూతన స్త్రీ పురుష సంబంధాలను, కుటుంబాన్ని గురించి కలలుకంటూ సాహిత్య సృజన కొనసాగించాడు. 1920ల నుండి 1950ల వరకు ఒక ముప్పై ఏళ్ళపాటు తానొక ప్రభంజనమై ఊపేశాడు చలం. చలం వంటి వారు స్వేచ్ఛా ప్రేమను బోధిస్తున్నారని నిరసనగా మాట్లాడటమూ దీనినే సూచిస్తుంది. ఈ ధోరణిని ఖండిస్తూ రంగనాయకమ్మ చలం సాహిత్యాన్ని అధ్యయనం చేయవలసిన పద్ధతిని, అర్థం చేసుకొనవలసిన తీరును వివరిస్తూ, సామాజికార్థిక పరిణామాల గురించి సమగ్రమైన శాస్త్రీయమైన అవగాహన లేకపోవటం వలన చలం సాహిత్యంలో కొన్ని తప్పుడు అభిప్రాయాలు, సూచనలు వ్యక్తం అయినమాట నిజం కాని స్త్రీ స్వేచ్ఛను ద్వంద్వ విలువల వ్యవస్థపై వాళ్ళ తిరుగుబాటును ఇతివృత్తంగా చేసి చలం వ్రాసిన విస్తృత సాహిత్యం ఆ పరిమితిని దాటి నిలబడగలిగిన శక్తి కలిగినదని స్పష్టం చేసారు. చలం 1926లో ఇంగ్లీషులో ప్రచురించిన Man & Woman కరపత్రంతో

సహా అతని సమస్త సాహిత్యం జండర్ సమస్యలను చర్చించింది. సామాజికం, లైంగికం అనే రెండు కోణాల నుండి దీనిని చూసాడు చలం. Man & Woman సామాజిక కోణం అయితే స్త్రీతో సహా మిగిలిన సృజన సాహిత్యమంతా లైంగిక కోణానికి సంబంధించిందన్నారు.

స్త్రీల విధేయత. పురుషుడి నియంత్రణ లేకుండా కుటుంబ నిలబడదు అని అనిపిస్తే, అలాంటి కుటుంబం లేకుండా పోవటమే మంచిదంటాడు చలం. ప్రేమ ఒక్కటే స్త్రీ పురుషుల సహజీవనానికి ప్రాతిపదిక కావాలని సూచించాడు. ప్రేమ నశించినపుడు సహజీవనం ఆత్మవంచనే అవుతుందని చలం అభిప్రాయం. అలాంటి ఆత్మ వంచనకు పాల్పడని స్త్రీలను ఆయన చిత్రించాడు. ఫెమినిస్టులకు చలం పదనిర్దేశకుడు. పిల్లలను కనటానికైనా, కనకుండా వుండటానికైనా స్త్రీదే నిర్ణయాధికారం అన్న విషయంలో కూడా చలం స్త్రీవాదుల అభిప్రాయానికి దగ్గరగానే వున్నాడు. అసలు తెలీదని, జీవితంలో స్త్రీ సమస్య వచ్చి హృదయంలో రక్తాన్ని ఉడికించిన దాకా, ఈ విషయమై స్త్రీలని అర్థం చేసుకోక సంఘం పెట్టే బాధల్ని తెలుసుకొని మండిపడ్డాడు చలం.

చలం సాహిత్యంలో. . . . అమ్మణ్ణికి బలవంతపు పెళ్ళి, పెదనాయన కూతురు రమణతో తన వివాహాన్ని సమాజం అంగీకరించకపోవడం, మామగారి మూడోభార్య ఎవరితోనో లేచిపోవడం – సంఘటనల ఆధారంగా చలం ఎన్నో కథల్నీ, నవలల్నీ రచించాడు. చలంగారి నాయికలు లేచిపోతారన్న అపప్రథ ఉంది. మైదానం నవల ఒకదాన్లోనే ఈ లేచిపోవడం అనేది ప్రధానమైన సంఘటన. ఈ నవలలో ఒక బ్రాహ్మణ స్త్రీ ముస్లిం యువకుడితో లేచిపోతుంది. ఈ నవలను చలం ప్రధానంగా ఆనాటి మధ్యతరగతి కుటుంబాల్లోని కృత్రిమ విలువల్ని ఎద్దేవా చెయ్యడం కోసం రచించాడు. చలం "అమీనా" అనే నవలలో కూడా అమీనా అనే ముస్లిం బాలిక ప్రధాన పాత్రగా కనిపిస్తుంది. చలం ఇంట్లో కొద్దిరోజులు ఓ ముస్లిం కులానికి చెందిన అమ్మాయితో చలానికి ఎంతో సాన్నిహిత్యం ఏర్పడింది. ఆమె పట్ల ఏర్పడిన ఈ సాన్నిహిత్యమే, ఆరాధనే అమీనా నవలగా రూపకల్పన చెందింది. నాయుడుగారు కాకినాడ బ్రహ్మ సమాజానికి అధ్యక్షులు, చలం సెక్రటరీ, రఘుపతి వెంకటరత్నం నాయుడుగారిని చలం తన మొదటి ఆధ్యాత్మిక గురువుగా భావించాడు. అతని ప్రియమిత్రులైన మొక్కపాటి రామ్మూర్తి, దేవులపల్లి కృష్ణశాస్త్రి లాంటి ఎందరో యువకులు ఆ రోజుల్లో బ్రహ్మసమాజంలో పనిచేసారు. ఈ స్వేచ్ఛా ప్రణయ సిద్ధాంతాల ప్రభావంలో ఉన్న రోజుల్లోనే చలం "శశిరేఖ"



నవలను రచించాడు. ప్రేమకంటే స్వేచ్ఛే నాకు ముఖ్యం అంటుంది. నవలలోని నాయిక శశిరేఖ. బ్రాహ్మణ కుటుంబాల్లోని బాల వితంతువులకు రక్షణ లేకపోవడం – ఈ రెండు సమస్యల్ని చిత్రిస్తూ చలం బ్రాహ్మణీకం అనే నవల రాసాడు. Daughter Fixationగా తేల్చవచ్చు. తండ్రికి కూతురు పట్ల ఒక స్థిరమైన భావం ఏర్పడడం చివరిరోజుల్లో సౌరిస్‌లో ఈశ్వరుణ్ణి దర్శించానని భావించి ఆమె చెప్పిన ప్రతిమాటను ఈశ్వరుడు అంటే సాక్షాత్ భగవంతుడే చెప్పినట్లుగానే భావించాడు. జీవితమంతా తీవ్రమైన మానసిక అశాంతితో గడిపిన చలానికి చివరకు రమణాశ్రమంలో సౌరిస్ సన్నిధిలో ఆమెను ఈశ్వరుడని నమ్మడంవల్ల గొప్ప శాంతి లభిస్తుందని చెప్పడం కోసమే చలం జీవితాదర్శం నవలను రచించాడు. ఇదే ఆయన చివరి నవల. స్త్రీ అనే పేరుతో చలం తన నవలలోనే కాకుండా కథలలోను, నాటికల్లోను, నాటకాల్లోను స్త్రీ సమస్యలను అనేక కోణాల్లోంచి ఎలా విశ్లేషించాడో డా. ఈదారెడ్డిగారు ఈ సిద్ధాంత గ్రంథంలో సమగ్రంగా చర్చించారు. పాశ్చాత్య దేశాల్లో స్త్రీవాదం అనేది బలంగా వేళ్ళూనకముందే ఆంధ్రదేశంలో చలం స్త్రీవాదాన్ని ఒక బలమైన ఉద్యమంగా ముందుకు తెచ్చాడు. స్త్రీల పక్షాన నిలచి ఒంటరిపోరాటం చేసాడు. చలం మీద పరిశోధన చేసిన మొదటి పరిశోధకుల్లో ఈదారెడ్డిగారి ఈ పరిశోధన చలం సాహిత్యంలో ఉన్న స్త్రీ పురుష సంబంధాలను చర్చిస్తుంది. స్త్రీ సమస్యలను సామాజిక, ఆర్థిక, మానసిక దృక్పథాల నుండి చర్చిస్తూ వాటి పరిష్కారాలను ఆవిష్కరిస్తుంది.

---

(ప్రసారిక – మే, 2005)

# లల్లేశ్వరి వాక్కులు

పరమసత్యమే జీవులకు అనుభవము అనుభవించబడేది. వస్తువు లేక తత్త్వము. అనుభవ ప్రజ్ఞ కలిగిన అహంకారము. ఈ త్రికము ఒకే ఒక పరమవస్తువు యొక్క రూపవైచిత్రికి నిదర్శనం. ఈ మూడునూ ఒక్క శివతత్త్వమే. ఆ శివుడే ఈ మూడుగా తన విభూతిచేత ప్రకాశిస్తున్నాడు. ఈ సత్యాన్ని అనుభవంలో తెలుసుకోవటమే ముక్తి. స్వచ్ఛమైన భక్తి, సర్వాతీతమైన శ్రద్ధ, యోగము అని చెప్పవచ్చును. అట్టి అసాధారణ, అలౌకిక భక్తికి, ఏకాగ్రత యోగసాధనను ఒక సామాన్య గృహిణిగా, జీవనంలో సాధించి ప్రసిద్ధిపొందిన ఒక మహాశివయోగిని లల్లాదేవి. ఆమె వాక్కులు కాశ్మీర్ భాషలో శారదా లిపితో కాశ్మీర దేశమందు జనసామాన్యానికి సర్వత్రా పాడుకునే సాహిత్యం, ఢిల్లీలోని సాహిత్య అకాడెమీవారు ప్రచురించిన జయలాల్ కౌల్ రచనలో లభించినవి. జయలాల్ కౌల్‌గారి గ్రంథమందు 138 వాక్కులు ఉన్నాయి.

సృష్టిలో భాగంగా ప్రకృతిని ప్రేమించి గౌరవించి ఆరాధిస్తూ దానిని సంరక్షించే జీవిత విధానానికి దూరమై ప్రకృతి శక్తులను బానిసలు చేయాలన్న ప్రయత్నాలే నేటి మన దుస్థితికి ముఖ్యకారణాలు. ఆధునిక మానవుని మానసిక రుగ్మతలూ భౌతికవాంఛా ప్రకోపాలు ఒక వంకా, ప్రకృతి వైపరీత్యాలు మరొకవంకా మనుగడకే ముప్పుతెచ్చే ఈ తరుణంలో ఆస్తికత అధ్యాత్మికతలే మానవాళి మొత్తానికి శరణ్యాలు. మన భరతభూమి ఋషులకు మునులకు సిద్ధులకు యోగులకు పెట్టినది పేరు. సకల మానవులకూ సర్వభూభాగాలకూ వెలుగులు, భౌతిక విషయాల ఎడల వైరాగ్యం చూపగలిగినవారికి అతిశీఘ్రంగా కళ్ళెదుట సాక్షాత్ శివ సాక్షాత్కరమే లభిస్తుందని లల్ల జీవితమూ ఆమె చిరస్మరణీయమైన వాక్కులూ మనకి తేటతెల్లం చేస్తాయి. ప్రతి ఏక సమానత ప్రధానమన్న మూలసూత్రానుసారం, భాషాశాస్త్రభాగంగా అనువర్తిత భాషాశాస్త్రం ఆధారంగా అనువాదశబ్దం సాంకేతిక పారిభాషికపదంగా రూపుదిద్దుకున్న నేపథ్యంలో స్వేచ్ఛాను వాదం అసాధ్యం. స్వేచ్ఛ ఉంటే అనువాదమే కాదు. అనువాదమే అయితే స్వేచ్ఛ ఉండగలదు. తెలుగు సాహిత్య వికాసం మొదలైంది అనుసృజనలతోనే. నన్నయ భారతాన్ని గురించి తిక్కన వాడినమాట తెనుగు ఒనరించుట, తన భాగవతాన్ని గురించి పోతన వాడిన మాట తెనుంగుం చేయుట, తెనిగించుట. ఈ మాటలను మనవాళ్ళు చేస్తున్న అనుసృజనలను చక్కగా నిర్వచిస్తాయి.



నా మొర దైవం విను గాక
అనపాయంగా నన్ను తీరానికి చేర్చుగాక
కాల్చని మట్టి పాత్రలో నీటిలా
గిర గిర తిరుగుతూ
కరిగి కారి పోతున్నా
నా గురికి నన్ను చేర్చుగాక

లల్లేశ్వరి తనని తాను కాల్చబడని మట్టికుండతో పోల్చుకొంటోంది. అత్తగారు క్రూరురాలు. నిత్యం పలువిధాల హింసించి కసితీర్చుకుని ఆనందించేదేమో ! లల్లా భర్త ఆవిడకు సవతి కొడుకనీ ఓ ఐతిహ్యం. ఆమె కోడలి కంచంలో నున్నని గుండ్రాయిని పెట్టి మీద రాయి కనబడకుండా ఉండేవరకు పలచగా అన్నం మెతుకులు చల్లి కంచం నిండా అన్నం ఉన్నట్లు కనిపింపచేసి ఇచ్చేదట ! నోరెత్తకుండా మెతుకులే తిని ఆ రాయిని కడిగి యథాస్థానాన్ని ఉంచేదట. యోగిని కాకపూర్వమే పద్మావతి, లల్ల కడవపట్టుకొని నదికి పోతుంటే తోటివారు లల్ల ఇంటిలో గృహశాంతి సందర్భంగా విందుకు తమని పిలవదా అని అన్యాపదేశంగా అడిగినపుడు ఆమె మాటలను ఒక వాక్కుగా కొందరు గ్రంథస్తం చేశారు.

వారు బలియమేపిన గొర్రెను కోయవచ్చు
లేదా లేత గొర్రెపిల్లను కోయవచ్చు
ఉండనే ఉంది కదా లల్లకు గుండ్రాయి

ఆమెకు జ్ఞానం తప్ప మరొకటి అవసరమే లేదు. తానొక పురుషుని కొరకు శోధనలోనుండి దినములతో సంచరించుతున్నట్లు వివరించేది. ఆమెకు జగమంతా శివమయమే. ఒకనాడు షాహమదాన్‌ను చూసింది. చూడగానే దర్శనమైంది.

నా ఆత్మా నీకోసం
నీ కోసమే నా దుఃఖం
ఇహపు మాయాజలం నిన్ను బంధించింది
వస్తు ప్రపంచానికి నిన్ను నువ్వు
ఇనుప వలుపులతో బిగించుకొని ఊగినా
నువ్వు చనిపోయాక దేని నీడయినా నీతో రాదు
మరెలా నీ ఆత్మని మరచావు?

బౌద్ధంలోని ఆధ్యాత్మిక భావన ఉంది.

ఇక్కడ నేను నువ్వు అనే భావన లేదు
ధ్యానానికి ఏమీ లేదు.
సర్వ సృష్టికర్త ఇక్కడ జ్ఞప్తిలో లేదు.
కఠినమైన అనిర్వచనీయమైన మహిమ తమాన్ని
ఎరుకలేని జ్ఞానాంధులు కానలేరు.
శుద్ధులు బుద్ధిమంతులు మహిమ తమంలో లీనమౌతారు.
నా తనువు అనుభవించే సర్వం
పరమశివుని చేరే దోవని వెలుగులతో నింపుతూ
శివతంత్ర సాధన అయింది.

పూర్వజన్మల సుకృతాలవల్ల, పుట్టినింటి సంప్రదాయమైన పూజ, జపతప సాధనాల వలన, శివప్రేమ, గురు శుశ్రూష వలన లల్ల ఆత్మతత్త్వ మెరిగి క్రమేణా సంచారిగా బిత్తలగా ఎల్లడలా పరమశివుని కరుణతో పరతత్త్వాన్ని దర్శిస్తూ శివసాయుజ్యం పొందింది.

1973లో తన ప్రతిభా పాటవాలతో పాశ్చాత్య పండితుల కృషిని సైతం పరిశీలించి, చిత్తశుద్ధితో ఆరాధనాభావంతో శ్రీ జయలాల్ కౌల్ సాహిత్య అకాడెమీకి అందించిన ప్రతి ఈనాటికి అత్యుత్తమైనదని నిర్ద్వంద్వమైన విద్వదభిప్రాయం.

డా॥ వి. వి.బి. రామారావు గారు ఈ వాక్కులను తేటతెలుగులో అనుసృజన చేసారు. శ్రీరామారావు గారు ఇదివరకే విశ్వనాథ రామాయణ కల్పవృక్షమును ఆంగ్లంలోకి అనుసృజించినారు. వారు బహు భాషాపండితులు. తెలుగులో లల్లేశ్వరి వాక్కులు అందించి ఒక మహోపకారాన్ని చేసారని చెప్పవచ్చును.

(ప్రసారిక - జూలై, 2005)



## చక్కని టైటిల్ దస్తావేజు "మంకమ్మతోట లేబర్ అడ్డా"

అన్నవరం దేవేందర్ తన ఊరు పోతారం నుండి 'తొవ్వ'ను దొరుకపట్టుకోని తన నీడ హుస్నాబాద్ నుంచి 'నడక'ను సాగించి ఇప్పుడు కరీంనగర్‌లోని మంకమ్మతోట లేబర్ అడ్డాతో తెలుగు కవిత్వంలో అడ్డా బిరాయించిండు. తేపతేపకు గోసగోసోలె చూసుకుంటూ తన కండ్లల్ల నీళ్లు కండ్లండ్లనే కుక్కుకుంటూ ఊరు, నగరం ఆధిపత్య ప్రాంతం రాజ్యం అమెరికాలను ఒక సనసన్నని బాధతో ఒక గుండెపగిలే వేదనతో తన మట్టి ధిక్కారస్వరభాస్వరంతో మంట పెడుతున్నాడు. తెలంగాణా ప్రజలు మాట్లాడే భాషను కించపరచడం కృష్ణా గోదావరి నదుల నీళ్ళను కాజేయడం – ప్రాజెక్టుల కిందున్న తరిభూముల్ని చాపకింద నీరులా కబ్జా చేయడం. ఇది ఎంతదూరం పైలాయించిందంటే బతుకులు తెర్లుతెర్లై ఆకలి చావులు, సామాజిక ఉద్యమాల్ని కేవలం 'శాంతిభద్రతల' సమస్యగా చిత్రీకరించి అశేష ప్రజల చిరకాల కోరిక నాలుక సందున ముల్లు గుచ్చింది – తెలంగాణ తెలంగాణంతా నెత్తుటితో తడిసి ముద్దయి పోయింది. కనీసం కారిన నెత్తుటికి తక్షణం రక్తదానం చేద్దామన్నా చాలామంది ఇక్కడ పనిలేక దొరకక 'ఎనీమియ'తో దనుసుక దనుసుక మొసతీస్తున్నారు. మొక్క మొక్కకు తవుటం పెట్టి ప్రాణానికి ప్రాణం ఎదురేసి మొక్క మొదలును జీవధారతో తడిపేదే– సముద్రపు ఉప్పదనంతో కమ్ముకూలిన బండిచక్రం – గండిపడ్డ చెరువు – దూరదేశాలకు వలసపోతు ఇండ్లకు తాళం వేసిన ఊరు "చింతలు యాపలు పెరిగి విరుగుతున్న మర్రిమాత్రం కొత్త ఊడలతో నిలబడుతుంది." ప్రశ్న కవిత వేటకొడవలి, అప్రమత్తం చేసే కావలి కుక్క

అవ్వా
అలగ్ అలగ్ అంటే
ఇల్లు ఒక్కటేనే !
కుండనే వేరు
దేశం ఒక్కటే
రాష్ట్రాలు వేరు వేరు– ఏర్పాటు వాదనకు నిదర్శనం.

మట్టికాళ్ల పాదముద్రలు, పొయ్యిని ఇంటి ముందర గద్దెలను ఎర్రమన్నుతో అలికిన తరువాత స్త్రీలు పాలు అన్నం కలిపి చుక్కలుగా లతలుగా తీర్చిదిద్ది నిమాయిష్ నింఢా నీళ్ళులేని చేదబాయిలోంచి కన్నీళ్ళను చేదినప్పుడు దరులకు తాకి దెబ్బలు తిన్న బొక్కెన, పశువులు అంగడి గోస - గుండె కలుక్కుమనడమే - చిన్నపిల్లాడు కొట్టుకుపోయిన మోకాలిచిప్ప నొప్పి - అసలు అన్నవరం దేవేందర్ రూపాయికి నూరూ పైసలు తెలంగాణా కవి. ఒకనొక తెలుగు ప్రాతినిధ్యకవి.

పల్లె పొలిమేరలు దాటి అంగటిలో గొడ్డు గోదా అమ్ముడుపోయినట్లు తనకు తానే అమ్ముకుంటున్న దృశ్యం. లేబర్ అడ్డామీది మనుషులు ఎలా వుంటారు. బక్క చిక్కిన దేహాలు, లొట్టబోయిన కండ్లు, గోసగోస మాటలు, గోవుల్లాంటి చూపులు పనికి ఎవరు పిలుస్తరా. . . . !

సున్నం వేసే కుంచెలు
తట్టపార, గడ్డపారలతో
పల్లె తరుముతె
పక్షులన్ని అడ్డా మీద వాలాయ్
చెయిసంచిల సద్దిగిన్నె
ఎవలు పిలుస్తరా. . . .

అని ఎదిరి చూపులు నిలువెత్తు కవిత్వం.

వాళ్ళందరూ హుస్నాబాద్, వేములవాడ, సిరిసిల్ల వూర్ల నుంచి అడ్డమీదికి వచ్చి కూలీలైనారు. కవిత్వం సూటిగా స్పష్టంగా వుంటుంది.

"ఊర చెరువులో ఈతకొట్టంగ పులసాలకు జనిగె బట్టినట్లు" పల్లె తెలిసిన కవి మాత్రమే ఈ మాటలు చెప్పగలడు. అతనికి అండ్లదుర్గం ఇండ్లదుర్గం మత్పరిచ్చుడు సప్పరిచ్చుడు రాదు. అంతా నిక్కచ్చి ముచ్చట్లే కవిత్వమంతా ఇంతే. పల్లె రెక్కలు తెగిపడ్డ గువ్వ చక్రం కచ్రం బండి కమ్ముకూలిన నేపథ్యం అతని ఊరు. ఇంకా అతని ఊరు ఇరిగిపోయిన పెంటపొనుక, తూట్లు పడ్డ వడ్ల బోరెం. కూలిపోయిన పిడికెల కుచ్చె, చెదలు పట్టిన పాతగుమ్మి, పగిలిపోయిన కూరాటి కుండ అలాంటి వాతావరణంలో కవి స్పందనలే తెలంగాణా తస్వీరు.

---

*(ప్రసారిక - డిసెంబరు 2005)*



# చెన్నప్ప కలం చెప్పిన "నానీలు"

సాహిత్యం సరళం
నానీలన్ని శ్రేష్ఠం
నానీకారుడు చెన్నప్ప
నరసింహునికంకితం

ఆటవెలది, తేటగీతిలాంటి ఉపజాతుల్లో వెసులుబాటు నానీల్లో వెసులుబాటు ఇలాంటిదే. మాత్రలకూ గుణాలకు అక్షరసంఖ్యకూ తార్కిక సంబంధం ఏమీ లేదు. భావాల్లో లయ, పదాల కూర్పులో లయలాంటివి, కవితాశక్తి నిర్మాణాన్ని ఆకర్షవంతం చేస్తాయి.

డా॥ చెన్నప్ప, మంచి, భావుకుడు, సహృదయుడు. ఒక చతురోక్తో, ఛలోక్తో, చమత్కారమో లేకుండా అతడు మాట్లాడడు. సద్యఃస్ఫూర్తి, సమయస్ఫూర్తితో అతడు వేదికలను వెలిగిస్తాడు. చెన్నప్ప నానీల్లో చమత్కారం, ఆధ్యాత్మికత, లోకవృత్తపరిశీలన, సామాజికాంశాలు ఉన్నాయి.

కడుపులో వున్నప్పుడు తంతే
బాధలేదు
బయట వుండి తంతేనే
నరకం

నేను
కష్టాల్లో వున్నాను.
ఈ దెబ్బతో
మిత్రులెవరో తేలిపోతుంది

నానీలు రావడంతో 'కవిత్వం మేడీజి' అని భద్రపడుతున్నారు కొందరు. మంచి నానీ రాయడం అంత సులభమేమి కాదు. బలమైన నానీకారుడు. నానీలు రాయడం కొత్త అనుభూతి. బలమైన నానీకారునిగా "మసన" మనస్సు కవి. నానీలు అన్ని ఋతువుల్లో పూసే అద్వితీయ కవితాకుసుమాలు.

అమ్మను
ఏమన్నా అన్నావంటే నేనూరుకోను
అమ్మంటే
అమృతం రా !

గొప్ప కవిత్వం
అంటే ఏమిటి?
నిత్యనూతనం
సత్యసుందరం !

– అమ్మకు అమృతానికి, కవిత్వానికి లంకె బిగించిన డా॥ మసన చెన్నప్ప ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో పనిచేస్తున్నారు.

(ప్రసారిక – జనవరి, 2006)



# జ్ఞానపీఠి "గంగప్ప"

భోదనావృత్తి సాహితీమూర్తి
ప్రీతి పాత్రుడు, ప్రేమమూర్తి
నిగర్వి, నిర్మల మూర్తి
మానవతావాది మా గంగప్ప కీర్తి

గంగప్పను అతిసమీపంగా పరిశీలించిన వారు సౌజన్యం మూర్తీభవించిన ఆయన వ్యక్తిత్వాన్ని అట్టే పసిగట్టేస్తారు. కాబట్టే ఆయన ఉపన్యాసం విన్నవారు. ఆయనతో సంభాషిస్తారు. సంభాషించినవారు స్నేహం చేస్తారు. స్నేహం చేసినవారు అనుబంధంతో అల్లుకుపోతారు. పల్లెలోపుట్టినా, ఎక్కడో పలు కళాశాలల్లో ఉద్యోగాలు చేసినా, ఆయన మంచితనం వల్లనే ఆయన గుంటూరు అక్కున ఆ సీమ గుండెగూటిలో చోటిచ్చినాడు.

కవులుంటారు, విమర్శకులుంటారు, పరిశోధకులుంటారు. కొందరు పర్యవేక్షకులుంటారు. ఇన్ని లక్షణాలు ఒకే వ్యక్తిలో మూర్తీభవించడం చాలా అరుదుగా జరిగేది నూటికో, కోటికో ఉండే అలాంటి వ్యక్తుల్లో గంగప్ప గారిది అగ్రతాంబూలం. నాలుగు కవితలు పత్రికల్లో అచ్చుపడితే విర్రవీగేవాళ్లు కొందరయితే, పది కథలో, రెండు నవలలో ముద్రణకు నోచుకుంటే రచయితల్లో మేటినని చాటుకొనేవారు మరికొందరు, విమర్శలు చేసి విమర్శక శిరోమణినని, ఒక విషయం మీద పరిశోధన చేసి పరిశోధక పరబ్రహ్మనని ప్రచారం చేసుకునే ఈ రోజులో, డెబ్బైకి పైగా పలు గ్రంథాలు ప్రచురించినా వీసమెత్తు అహంకారం కూడా మచ్చుకయినా మనసులో లేని నిగర్వి శ్రీ గంగప్ప.

పరిశోధక పర్యవేక్షకునిగా తనవద్ద పిహెచ్.డి.కి చేరిన విద్యార్థులను ప్రోత్సహించి పనిచేయించి, థీసిస్‌లు వ్రాయించడం తప్ప "ఎద్యుకేషన్‌సెస్సు" విధించడం తెలియని దేశికోత్తముడు ఆయన.

1936 నవంబరు ఎనమిదిన జన్మించిన గంగప్ప గారు పెనుగొండ, అనంతపురం, విశాఖపట్టణాలలో చదివారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి ఎం.ఏ., పట్టా సాధించారు. 1972లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం నుంచి పిహెచ్.డి. పట్టం పొందారు. డెబ్బది వసంతాల వయస్సు వచ్చే నాటికి డెబ్బది గ్రంథాలు ప్రచురించిన

గంగప్ప గారు. రచనల్లో నాటకాలకు సంబంధించిన పరిశోధనలతో పాటు నాటకాలున్నాయి. వాగ్గేయకారుల పదసాహిత్యంతోపాటు బాలగేయాలు ఉన్నాయి. జానపద గీతాల మధురిమను వెల్లడించే రచనలతో పాటు సిద్ధేంద్రయోగి, పురందరదాసు, నాగార్జునుడు మొదలైన మహానుభావుల జీవితాలను పట్టిచూపే రచనలున్నాయి. ఎర్రన రసపోషణ గురించి ఎలా విశ్లేషించారో, తిక్కన శాంతి పర్వానికి అలాగే వ్యాఖ్యానం వ్రాశారు. వీరు రచించిన జానపదవీరగాథా వాఙ్మయం, తులనాత్మక సాహిత్యం, బుర్రకథ, జానపద వాఙ్మయం పాఠ్యగ్రంథాలుగా వివిధ విశ్వవిద్యాలయాలలో బోధింపబడుతున్నాయి. 8,9,10 తరగతుల విద్యార్థులకోసం ఉపవాచకాలు వ్రాసినా ఇంటర్మీడియట్‌కు ప్రధాన సంపాదకులుగా తెలుగు పాఠ్య గ్రంథాలను తయారు చేశారు. 600 పైగా సాహిత్యవ్యాసాలు, వందకుపైగా సదస్సులలో పత్ర సమర్పణలు చేశారు. వివిధ విశ్వ విద్యాలయాల్లో. . . కాకతీయ, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయాల్లో విజిటింగ్ ఫెలోగా, బెనారస్, ఆలీగఢ్, శ్రీ వేంకటేశ్వర, మద్రాసు, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయాల్లో ఆయన వివిధ సాహిత్యభాషా విషయాలపై చేసిన ప్రసంగాలు ఎందరినో ఉత్తేజితులు చేసినాయి. చాలామంది పిహెచ్.డి., ఎమ్.ఫిల్. డిగ్రీలు పొందారు. పరిశోధకులను ఆయన ప్రోత్సహించేతీరు, వెంటబడి పనిచేయించే తత్త్వం, పరిశోధనా పద్ధతులను తెలియజేప్పే విధానం విలక్షణంగా ఉంటుంది. వారు తమ పరిశోధకులకు ఇచ్చిన అంశాలలో అనంతమైన వైవిధ్యం కనిపిస్తుంది. భారతం, నాటకాలు, పదసాహిత్యం, నవలలు, వచన కవిత్వం, బుర్రకథ, జానపద సాహిత్యం, హరికథ, కథాసాహిత్యం, ఆయన తమ శిష్యులకిచ్చిన అంశాలు. కొడవటిగంటి, తిరునగరి రామాంజనేయులు, నాజర్, జాషువా, నార్ల, బైరాగి, విశ్వనాథ, ఆత్రేయ, ఆరుద్ర, స్ఫూర్తిశ్రీ మొదలగు వారి రచనలపై ఆయన పరిశోధనలు చేయించారు. ఆయన దగ్గర పరిశోధన చేసిన విద్యార్థులంతా కలిసి వారి పదవీ విరమణ మరియు షష్టిపూర్తి సందర్భంగా శ్రీగంగప్ప సాహితీ పురస్కారాన్ని ఏర్పాటు చేసి పది సంవత్సరాల నుండి మహావైభవంగా జరుపుతున్నారంటే వారందరికీ గంగప్ప గారి మీద ఉన్న గౌరవం, అభిమానం ఎంతటివో ఊహించుకొనవచ్చు.

గంగప్పగారు పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం సెనెట్ సభ్యులుగా, యు.జి.సి. రీసెర్చి అసోసియేట్స్ ఎంపిక సంఘం సభ్యులుగా, భారతీయ జ్ఞానపీఠ పురస్కారం తెలుగు భాషా సలహాసంఘం సభ్యులుగా, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఇంటర్మీడియట్ తెలుగు టెక్స్ట్‌బుక్ కమిటీ అధ్యక్షులుగా తెలుగు భాషా పరిరక్షణ సమితి, గుంటూరు శాఖకు అధ్యక్షులుగా వ్యవహరిస్తున్నారు.



క్షేత్రపద సాహిత్యానికి, పదకవితకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు, వేయి పడగలు విశ్లేషణాత్మక విమర్శకు విశ్వనాథ సాహిత్యపీఠం అవార్డు, అన్నమాచార్య ప్రముఖ వాగ్గేయకారులు తులనాత్మక అధ్యయనానికి తెలుగు విశ్వవిద్యాలయం సాహితీ పురస్కారం అందుకున్నారు.

గంగప్పగారు అలుపెరుగని అవిశ్రాంత సాహితీవేత్త, నిన్నగాక మొన్న ఆయన తెలుగు ఇంగ్లీషులలో వెలువరించిన "తెలుగు నాటకం-సామాజిక చైతన్యం" అనే గ్రంథం దానికి నిలువెత్తు సాక్ష్యం అని చెప్పుకోవచ్చు.

'కృషితో నాస్తి దుర్భిక్షమ్' అనే వాక్యానికి ఆయన ఒక ఉదాహరణ. 'విద్వాన్ సర్వత్ర పూజ్యతే' అనే నానుడికి ఆయన ఒక సాక్ష్యం.

# "ఎస్వీ తస్వీరం"

"అక్కడి ప్రతి ఇటుకకూ నా జ్ఞాపకాల స్పర్శ ఉంది
గోడలంటే గోడలా అవి నా అనుభవాల జాడలు !"

ఎస్వీ మంచి వక్త. వేదిక లెక్కితే అతని వాగ్ధార ధారాళం. అతనికి ఆవేశం ఎంత ఉందో, అనుభూతీ అంతే ఉంది. అతన్ని సన్నిహితంగా ఎరిగినవాణ్ని కాబట్టి ఆయా సన్నివేశాల్లో అతని సంవేదనను గమనించినవాడిని. 'అమ్మ' స్మృతిలో కవిత రాసినా, తన చిన్నప్పటి ఇంటి గోడలు కూలుతూ తనను ప్రకంపనాలకు గురి చేసినా ఎస్వీ కవిగా స్పందించాడు. ఎస్వీ వేదికల మీద వక్త కాబట్టి కవిత్వంలో కూడా అతనిది వక్తృత్వ శైలే. అయితే కవిత్వంలో మాటలతో పాటు మౌనం కూడా ఉంటుంది.

"మౌనాల మధ్య ఒకానొక తౌల్యాన్ని సాధించినవాడే మంచి కవి".

"తప్పిపోయిన మనువడి కోసం కన్నుల్లో గుండెను మోస్తూ
పట్నమొచ్చి దేవులాడుతున్న పిచ్చితాతా !"

వీధి మానిసి దీనావస్థలోకి ప్రవేశించి, తానూ అతని వేదనలో ఒక భాగమౌతాడు. కవిత్వం కేవలం ఉద్యమాల వాహిక మాత్రమే కాదు, వాటి స్ఫూర్తికి వేదిక. ఇట్లా అనడం వల్ల ఉద్యమాన్ని తక్కువ చేయడం కాదు. దాని పరిణామ శక్తి తెలియకా కాదు. కానీ కవిత్వం జీవితమంత పెద్దది.

జన పోరాటం ప్రతిబింబితాలైన వాటికి ఫోక్ వాస్తవికత అంటుందే కింది తరగతుల్లోకి వెళ్ళవు. "గెలవడం తెలిసినవాడికి ఓడే ధైర్యమూ ఉంటుందని" జనానికి నిరాశదశలో వెన్ను చరచటమూ, "దోపిడి ఉన్నంత కాలం – పీడిత వర్గం చేతిలో ఆయుధంగా నువ్వున్నావా? లేదా? అన్నది ప్రశ్న" ఈ కవితల్లో ఎస్వీ దృష్టి ఇది.

ఎస్వీ ప్రతి కవితలో కోట్ చేయవలసిన పంక్తులున్నాయి. ఇక్కడ నేనా పనికి పూనుకోలేదు. కవికి ముందు విశేషణాలు జోలికి కూడా వెళ్లటం లేదు. ఇంతవరకు వ్యక్తం కాని ఆంతరిక కోణాలను ఆవిష్కరించిన ఈ సంపుటికి నేను సంతోషిస్తున్నాను. జననినీ, జన్మభూమినీ, తానాశించే వర్గరహిత సమాజ స్థాపనకై పోరాడి వొరిగిన



వీరులనూ మానవత్వం స్పర్శతో, ఉద్యమ స్ఫూర్తితో, ప్రగతిశీల దృక్పథం అందించిన తాత్వికతతో విశ్లేషించటం కవితా సంపుటిలో చూడగలం. ఇందులో వాడే భావచిత్రాలు, పదచిత్రాలు "మీ కళ్ళ జారలు కవిత్వానికి పల్లవులై ప్రాణం పోస్తున్నాయి."యాబది కవితల జీవితం నిజం సాధించే ఉద్యమం మార్పుకు తీర్పు ఎస్వీ తస్వీరు."

ఈ కవితా సంపుటిలోని యాభై కవితలు ఎస్వీ యాభైవ జన్మదిన పత్రిక.

ఎస్వీ అంటే డా॥ ఎస్.వి. సత్యనారాయణ. ఆయన ఉస్మానియా తెలుగు విశ్వవిద్యాలయాలలో ఆచార్యులుగా పనిచేస్తున్నారు. అరసం సంఘం అధ్యక్షులు.

---

(ప్రసారిక – ఫిబ్రవరి, 2006)

# "చంద్రికే" వెన్నెల పువ్వు

హనుమారెడ్డి గారి కొన్ని జ్ఞాపకాలు "వెన్నెల మల్లెలు చల్లేవి" "వెన్నెలవాడలు వెలిశాయి. ఆయన తన "బంగారి"ని మననం చేసుకుంటూ "ఏకోనల్లో పుట్టిందో వెన్నెల బొమ్మ" అంటూ తన అప్యాయతకు అక్షరాభిషేకం చేస్తాడు.

"హనీలు" శీర్షికతో రాసిన కవితలో "ఆకాశం వెన్నెల ముద్ద-కురవదు" అంటూ కొత్తదనాన్ని శబ్దచిత్రంలో అందిస్తాడు. హనుమారెడ్డి గారు న్యాయవాదిగా తర్కనిపుణుడైనా కవితావేదిగా పరమభావుకుడు. ఈ పుస్తకంలోని కవితలన్నిటిలో సుతిమెత్తగా పరుచుకున్నది ఆ భావుకతే. లలిత లలిత పదబంధాలు, కమనీయ భావ విస్తృత గంధాలు ప్రాయికంగా గుభాళించే ఈ సంపుటిలో ఒక వినూత్న పదచిత్రం కళ్లకు కదుతుంది.

"సానలు తీరని జాతిరత్నం" అనగా విన్నాం. ఇది 'కడగని అక్షరం'. గతంలోంచి వర్తమానం లోకి యధాతథంగా అడుగుమోపిన స్వరం. లోతైన పంక్తియిది. ఒక వైపు ప్రముఖ న్యాయవాదిగా తన వృత్తి నిర్వహిస్తూ, మరోవైపు ప్రకాశం జిల్లా రచయితల సంఘం అధ్యక్షుడుగా తన పాత్రను సమర్థంగా పోషిస్తూ-కవిగా జీవిస్తున్న బి. హనుమారెడ్డి గారికి నా హార్దికాభినందన. ఈ కవి జన్మతః భావుకుడు. మనిషి ఎదుగుదలతో భావుకతకూడా ఎదుగుతుంది.

చంద్రిక పువ్వుతో ఉపక్రమించారు. వెన్నెల వంటి పువ్వు, పువ్వు వంటి వెన్నెల. ఉపమాన పూర్వపద కర్మధారయమైనా అదే. ఉపమాన ఉత్తర పద కర్మధారయమైనా అదే!. అదే తన దుహిత దుహిత ! అదే తన హృదయ కవిత !. భావకవిత్వం ఉంది. ప్రేమ కవిత్వం ఉంది. సామాజిక కవిత్వం ఉంది. జానపద గీతం లాంటి కవిత్వమూ వుంది. వివిధ పూల సమాహారమైన కవితా కదంబం. వెరసి కావ్యం 'వెన్నెల పువ్వు' అయింది.

నా బంగారి
ఒకసారి చిరునవ్వు చిలకరించిన చాలు.
'మోడులోంచి చివురు చీల్చుకొస్తే విప్లవం



వేరుతొక్కి విత్తు పాయలైతే విప్లవం
జలదం ఎడద పిగిలి చినుకు దూసుకొస్తే విప్లవం
అమ్మ బిడ్డకు జన్మ నిచ్చిన క్రమం విప్లవం
వినూత్న వ్యవస్థ రెక్క విప్పితే విప్లవం

హనుమారెడ్డి విప్లవాన్ని నిర్వచించిన తీరు వినూత్నం. విప్లవమంటే కుత్తుకలు కోయడం కాదు. నెత్తురు కాల్వలు కట్టడం కాదు. విప్లవమంటే రిత్తదనాన్ని కాలరాచి కొత్తదనాన్ని ఆవిష్కరించడం అంటాడు కవి.

రేపటి యుగంలో
మమతల్ని పండించుకుంటూ
ప్రేమల్ని పంచుకుంటూ
కొత్తమనిషి పుడతాడు

అనే ఆశాంశను వ్యక్తీకరించే సూర్యుని వీలునామా కవితలో గొప్ప అవిష్కరణా శిల్పం వుంది. అమ్మ గురించి ఎవరు ఏమిరాసినా బాగుంటుంది. అమ్మ అనే రెండు అక్షరాలే ఒక గొప్ప కావ్యం.

"వసంతాన్ని దొంగలు దోచుకున్నారు"
అని అనగలిగిన కవి మంచికవి కాకుండా ఎలా ఉండగలదు ?
"సూర్యుడు స్నానానికి దిగాడు
ఎంత సేపటికి పైకిరాడు"

"రాత్రి నిద్రలో కవిత్వం పొంగిపొరలింది". ఎంత మంచి పంక్తులు రాయగలిగాడు.

మట్టి ముద్దలా నువ్వు
చద్ది బువ్వలా నువ్వు

పళ్లెంలో ఆరబోసిన అన్నం మెతుకుల్లా అలరారుతున్న అక్షరాలివి. హనుమారెడ్డి గారు నిలువెల్లా సహృదయుడు. ఎందరో కవులను వేదికలెక్కించి సంతోషించినవాడు. ఎందరో కవుల కవితలను గ్రంథాలుగా పాఠకులకు అందించి, తానే ఓ గ్రంథాన్ని లోకంలోకి విసిరేస్తున్నాడు. వీరి కవిత్వం అంతా వెన్నెలపువ్వు. కవికి కన్ను, చెవి,

# "రత్నంలాంటి కవిత"

వర్గసమాజలక్షణాన్నీ, ఆధునికమైన దోపిడి స్వభావాన్నీ. ఒక సరికొత్త వాతావరణంలో ఈ కవి చెప్తున్నాడు. గుడి, దేవుడు, పూజారి, భక్తజనం-వీటి సమీకరణలో పూజారి గుడికి సర్వాధికారి. అప్పుడు 'దేవుడు వరమిచ్చినా పూజారి వరమివ్వడు' అనేది సరిగ్గా సరిపోతుంది. కాని దేవాలయాలకు ధర్మకర్తల ఆధిపత్యం, రాజకీయంలో భాగస్వామ్యం వచ్చిన తర్వాత పూజారి ఒక ఉద్యోగి మాత్రమే అయ్యాడు.

"వేలంలో ఈనాముల భూములు భూస్వాముల జాలంలో దేవుడి ఆస్తులు"

దేవాలయ రాజకీయం, ప్రభుత్వం రాజకీయం ఒక భాగం కావడం, కవి స్పష్టంగా చెప్తాడు. చక్కని వివరణ.

పేదరికం ఎప్పుడూ పంచె అంచునే అంటుకుని ఉంటుంది. చిరిగిన పంచె అంచును ఉత్తరీయందాస్తుంది'. కవికి ఉదయం నుండి సాయంత్రం వరకు జరిగే తంతులన్నీ తెలుసు. వాటిలోని ఏ స్వచ్ఛతని భక్తులు నమ్ముకుంటారో తెలుసు.

'అర్చకుల నిత్యధూపదీపనైవేద్యాలకు
మాన్యం, మక్తాలు అడుగంటి
భూస్వాముల కబంధ హస్తాల్లో చిక్కి శల్యం
గుడిపావురాల కుహకుహలు
అర్చకుల ఆకలిమూల్గులతో కలిసి పోయారు.

గుడిలోని ఆచారాన్ని వర్ణిస్తూనే, బతుకు భయంకరత్వాన్ని ధ్వనింపజేస్తాడు. ఆచార సంప్రదాయాలకీ, భౌతికజీవన విచ్ఛిన్నతకీ కవి తెలియజేసే వైరుధ్యం ఇలాంటి చోట్ల సునిశితమై స్పందించాడు.

మంగళహారతిలో పావలా ఒక్కటి
కర్పూరకాంతిలో తళుక్కున మెరుస్తుంది
చిడిమాను మీది అమాయకపు మేకపిల్ల కంఠంకొరికే
గణాచారి నోట్లోంచి క్రూరంగా రాలిన రక్తం
జరిగిన అరాచకాన్ని తెలుపుతుంది.

ఈ మధ్యకాలంలో తెలంగాణా రచయితలు అవేశపూర్వకంగా చేసిన కృషిలో ఒక ముఖ్యమైన  ఉపలబ్ధి, ప్రాంతీయపదాల మీద గౌరవం కలిగించడం. తెలంగాణా కవులు చూపించిన ఈ మార్గం ఇప్పుడు సర్వప్రాంతాన్నీ ఉత్తేజితం చేసింది. దీర్ఘకవితకి 'కుంచెకోల' అనే పేరు పెట్టడంలో ఒక రహస్యం కూడా వుంది. ఏది భగవంతుడి తలుపులు మూసి, తెరుస్తారో అది పూజారి గుండెల్లో పొడిచే 'కోల' (బాణం) లాగా ఉంది. సరికొత్త వస్తువు, యు.వి. రత్నం, 'కుంచెకోల'కు సమకాలిక దీర్ఘకవితల్లో మంచి స్థానం లభిస్తుంది. "అప్పుడూ ఇప్పుడూ ఎప్పుడొ పూజారి ఫలాలు పైరవీయులవే" అనే వాస్తవ దృశ్యాన్ని సహజసుందరంగా చిత్రించారు. అంతేకాదు "అర్చకుల నిత్య ధూపదీపనైవేద్యాలకు మాన్యం మక్తాలు అడుగంటి భూస్వాములు కబంధహస్తాల్లో చిక్కిశల్యం" జనబలం, ధనబలం లేని అర్చకులపై ధనవంతుడి స్వారీని కన్నులకు కట్టిస్తారు. ధర్మసంస్థాపన చేస్తానన్న గీతాబోధన  గీత అందించిన సంస్కృతీ వైభవాన్ని కబళిస్తున్న పాశ్చాత్య నాగరికతను నిరసించారు కవి.

"ముఖ్యదేవాలయాల్లోని కొబ్బరిచిప్పలు హోటళ్ళలో కరిగిపోయి దేవాదాయ అధికార్ల జేబులు పండుతాయి"- అంటూ ఇవ్వాళ జరుగుతున్న అన్యాయాలకు రూపుకడతారు కవిగా. విశ్రాంతస్థితినందిన తరుణంలో పరిణత మనస్కుడై కవితా రచనకుపక్రమించారు. ఉప్పలపాటి వెంకటరత్నం (యు.వి. రత్నం) గారు ఉద్యోగ విరమణానంతరం వారికి దొరికిన సమయం చాలా చక్కగా కవితా వ్యాసంగంతో కవిమిత్రుల పరిచయాలతో ఆనందంగా నడచిపోవటం నిజంగావారి అదృష్టం.

(ప్రసారిక - మార్చి, 2006)



# భల్లం గారి కవితాత్మ "కొల్లేరు"

కమనీయ జలస్పందన ఈ కొల్లేటి కవిత. అప్పటి కొల్లేరును స్మరించుకుంటూ ఇప్పటి దయనీయ స్థితికి అశ్రుసేదనం చేస్తూ కొల్లేటికి సంబంధించిన వివిధ దశలను, విభిన్న పార్శ్వాలను కవిత్వంలో అద్ది ఈ కావ్యరూపంలో ఆవిష్కరించాడు శ్రీ యస్.ఆర్.భల్లం.

కొల్లేరు ప్రాంతంలో పుట్టారు, పెరిగారు, ఆడారు, పాడారు. అక్షరాలు దిద్దారు. అతని బాల్యంలో చూసిన కొల్లేరు కాదని అంటారు, ఎందుకంటే కొల్లేరిప్పడు కాలుష్య కాసారంగా మారింది. 260 చదరపు మైళ్ళు విస్తరించిన సుమారిప్పుడు 80 చదరపు మైళ్ళకు కుంచించుకు పోయింది. మానవుల స్వార్థ కాలుష్యానికి ప్రతిబింబమే ఈ కొల్లేటి కాలుష్యం. "ఎన్ని దేశాలు తిరిగినా / నాతో పాటు అన్ని చోట్లకూ ప్రవహించిన ఆనందపు పన్నీరు కొల్లేరూ . . . నీ ఊటలోంచి నా వొంట్లోకి ప్రవహించిన అక్షరాల్ని మళ్ళీ నీపైనే చల్లుతున్నాను" చక్కని అక్షరాభిమానం.

మట్టినీ, నీటి బొట్టునీ కలిపి ప్రకృతి వేసిన అక్షర చిత్రం లోకం నిండా కప్పుతాను. కిక్కిన పొదల మధ్య తాటి బుర్ర దోనెలో చక్కర్లు కొడుతుంటే మానస సరోవరంలోని హంసలాగ మనసు పరవళ్ళు తొక్కేది - చక్కని పోలిక వివరణ. ఇంత మౌనాన్నీ . . .  ఇన్ని కన్నీళ్ళనీ  . . . నాపైన కుమ్మరిస్తున్న ఈ కొలను అంటే నాకు కొలవలేనంత ఇష్టం - చక్కని వివరణ నీటి చీరకు కొంగల బారులే బోర్డరుగా మెరిసిపోతుంటే కిక్కిన పొదల్లోంచి నిక్కినిక్కి చూసే నీలమణుల్లా మెరిసే ఫలపుష్పాలు - చక్కటి వివరణ. సూర్యుడు మండుతాడుగాని డొక్కల్ని ఎండనివ్వడు కదా మన వాళ్ళని మనమే నరుక్కున్నట్టు, మన నీళ్ళని మనమే విషపూరితం చేస్తున్నాం - సాదృశ్యం.

నాబతుకు పుటల నిండా నీటిగీతాలు చెలరేగుతాయి - జీవిత సత్యం. ఈ పక్షి సమూహాలు  ఇప్పుడు కొల్లేటిని చూడగానే ముఖం చాటేస్తున్నాయి. ఆ పైన కనిపిస్తున్నవి ఫిలిపైన్, ఫిజీ దీవుల నుంచి కొంగలు తెచ్చిన మబ్బులేనా. . .  ఫెల్పికాన్, గ్రేడన్, ఫెమ్లింగ్ అరుదైన పక్షులన్నింటికి అన్నం పెట్టే లోగిలి కొల్లేరు. నీటికాకీ గవరకాకి బుట్టకాకీ / తెల్లకొంగా గూడకొంగా బీడుకొంగా కలవు కొంగా ఊదకొంగా / నల్లమెడ కొంగా ఎర్రగాలు కొంగా తెరిపి ముక్కు కొంగా / బెగ్గురు కొంగా రాత్రి కొంగా రత్తగుట్ట

కొంగా తీరపు కొంగా / పరజా పుంజా నలుగూ / బుర్రుపిట్టా పింపిపిట్టా పాలపిట్టా చాకలి పిట్టా సారంగిపిట్టా. . ./ అక్కడక్కడా బసచేసే ప్రపంచ దేశాల రాయబారులు – చక్కని వివరణ. ఇక్కడప్పుడు పేట్రేగే పేదరికాన్ని పేగులతో ముడివేసుకొని పిల్లలు నురగలు గోలికాయల్లా దొర్లుతారు – నిజమైన నిదర్శనం.

ఇప్పుడు నీటి గోడ మీద ఆరేసిన బతుకుబట్ట ఆకలి పేగులా వేలాడుతుందా? పాలకంకి మీద రైతుపిట్ట నోట మట్టి కొట్టిందెవరు. . . ?! కొల్లేటి దైన్యాన్ని చూస్తే కళ్ళు చెమ్మగిల్లవు గుండె చెరువౌతుంది, కవి బాధను వ్యక్తం చేసారు. కత్తిరి పిట్ట కొల్లేరిప్పుడు ఒక కల్పన కాదు ఒక సృజన కాదు అదిప్పుడు చిత్తుగా తడిసిన అగ్గిపుల్ల నిరంతర నిశ్శబ్ద దుఃఖ జోగిని – చక్కని వివరణ. కొల్లేరు – ఒక నీటి కుప్ప కాదు ఒక భావం. . . ఒక ప్రస్థానం. . . ఒక పరమార్థం – చక్కని నిదర్శనం. కొల్లేటి స్పర్శగా నా కవిత్వం – కవిగా నిరూపించుకున్నారు భల్లం.



# ఆచార్యమాదిరాజు రంగారావు "సృజన దర్శనం" ఒక పరిశీలన

"సృజన దర్శనం" కావ్యంలో ప్రకృతి నేపథ్యం సమాజ జీవితం ఏర్పడింది. మానవ ప్రపంచం మనస్తత్వ భూమికపై సృజన రూపాన్ని పొందింది. స్థూల తలంపు, సార్వజనీన భావజాలంతోనూ సూక్ష్మతలంపై వివేచన జీవన స్థితి గతులతోనూ దృష్టికి వస్తుంది. జీవన వాస్తవికత కేంద్రంగా కళాత్మకతను కలిగింది. అంతరమైన భావ స్థితికే ప్రాధాన్యమివ్వడం జరిగింది. ఈ కవిత్వంలో వస్తువు గురించి వర్ణనకూ, వివరణకూ భిన్నంగా విశేష భావననూ దర్శనాన్ని భావింపజేస్తూంది. సమాజం గురించి చింతనతో జీవితం గురించి దర్శనంతో అనురాగ సర్గతో మానవతా కావ్యంగా స్వేచ్ఛా కవిత్వంలో సమాలోచనకు ప్రేరేపిస్తుంది. కొత్తదనాన్ని విశ్లేషణతో వివేచనతో విమర్శనా ప్రక్రియను కవి అన్వేషించాలి అని మాదిరాజు రంగారావు గారు వ్యక్తీకరించారు. మనిషిలో సృజన శక్తి అస్తిత్వానికి బీజం. ఇది కవిలో నిత్య వసంతం నాలో స్మృతి కిరణం పగలూ రాత్రీ భేదం లేకుండా మానస శిఖర ఫలకంపై చిత్రం తరువాత చిత్రం చూపిస్తుంది. మనిషితో హృదయ భాష సహజం, భూమితో మేఘానికి వర్షభాష సహజం నరకబడిన చెట్టు వెనక వికాస చరిత్ర ఉంది పచ్చదనం కయి తపించు జీవన ధరిత్రి ఉంది. ఎవరెవరి ప్రమేయంతోనో ఎవరెవరి అవసరాలకో అడుగుముందుకు వేసే చరిత్ర.

చినిగిన "ఓజోన్" పొరలా శక్తి అందని "ఎచిలెస్" పాదంలా స్వార్థం సృజన రూపాన్ని మారుస్తుంది. జన సమ్మర్దమైన వేగంలో మనిషిలో ప్రాణానికీ మనిషితో యంత్రానికీ పోటీ పెరిగిపోతుంది. పూవును బాధిస్తే ఫలం రూపం సిద్ధించదు వేరును నరికేస్తే చెట్టుకు రూపం ఉండదు. చక్కని భావన డా॥ మాదిరాజుది.

## "మట్టి పరిమళం" - ఒక పరిశీలన

ఈ కావ్యంలో అంతర్లీనంగా మట్టిపరిమళం ప్రవహిస్తున్నది. ప్రకృతిని కావ్య వస్తువుగా మలచుకున్నప్పుడు కూడా కవి సామాజిక ప్రయోజనాన్ని సాధిస్తాడు. కదిలించే భాషనూ నడిపించే యాసనూ శ్వాసగా చేసుకుంటాం. సమాజంలో నయవంచకులూ, మోసగాళ్ళూ దినదినం ప్రబలి పోతున్నారు. ఒక వైపు తీయని మాయమాటలు మాట్లాడుతూనే మరొక వైపు విద్రోహానికి ఒడిగడుతుంటారు. ప్రజాసేవ పేరుతో ప్రజాధనాన్ని లూటీ చేస్తుంటారు. ఇలాంటి కపట నాయకుల గురించి ఇట్లా అంటాడు. విశ్వాసం ప్రకటించిన కుక్క ఆవిశ్వాస తీర్మానాన్ని జండా చేసుకొని ఊరేగుతుంది. వేదాలూ, ఉపనిషత్తులన్నీ కూడా మనిషి మొదట తనను తాను తెలిసుకోవాలని ఉద్బోధిస్తాయి. తనను తాను తెలిసికున్నవాడే జ్ఞాని, ఈ జ్ఞానం కలిగిన వాడి జీవితం సార్థకమవుతుంది. ఎదుటి వాళ్లను ప్రశ్నించడం నేర్చుకున్న నువ్వు నిన్ను నీవు ప్రశ్నించుకోముందు అంటాడు. మట్టిని కలిపే హస్తాలను ఆయుధాలుగా చేసుకుంటాం ఇది లొల్లి కాదు లొల్లాయి పాట అసలేకాదు అంటూ తెలంగాణా తత్వంలో యిమిడిపోయిన కవి. మట్టి పరిమళం ఈ సంపుటిలోని మరో మంచి కవిత. ఈ మట్టి కణాలకు తెలుసు నా అంతర్యం అని ఉద్ఘోషించిన ఈ కవికి కూడా ఆంతర్యం తెలిసిందే.

ఈ కవి మట్టి కవి. తండ్రి మీద రాసిన కవితల్లో నాన్న కవిత తప్పకుండా స్థానం సంపాదించుకుంటుంది. వెంకటయ్య గారి నాయన వృత్తిని దైవంగా భావించి కులాల కుంపటిలో బందీకాని వాడు. వరంగల్‌లో పుట్టినవాడు పాల్కురికి సోమన మీద కవిత్వం రాయకుండా ఎలా వుంటాడు. సోమన్నను ఈ కవి "దేశి కవితా అపరబ్రహ్మ" అని అన్నాడు. అమ్మ స్పర్శతో తడిసిన తనువు పవిత్రతను లోకానికి పంచాలి. అమ్మ స్వప్నం నిర్వచనానికి అందదు అమ్మ మనస్సు ప్రకృతిరాగమై మ్రోగుతుంది. కవిలో ఒక సంవేదన, పదునైన అభివ్యక్తి, నిర్మాణ కౌశలం వున్నాయి. మాటలను మట్టిలోంచి తీయాలిగాని అధ్యయనంలోంచి తీస్తే ఎలా? ఇందలి కవితలు ప్రధానంగా సమాజంలోని పలు దృశ్యాలను సంఘటనలను చిత్రీకరించేవిగా ఉన్నాయి. ఎక్కడ చూసినా ఏదోరూపంలో యుద్ధాలే జరుగుతున్నాయి. క్షేత్రాలన్నీ కురుక్షేత్రాలవలె కనిపిస్తున్నాయంటారు కవి. "మనిషి బుద్ధి మారి గౌతమ బుద్ధుడిగా ఎదగాలి. గతకాలము



మేలు వచ్చు కాలము కంటెన్ అని నన్నయ చెప్పిన మాట. ఈ కవి, ఈనాటి వేర్పాటు భావ ఉద్యమాలను చూచి "గతంలో మన తాతలు ఐక్యంగా సమైక్యంగా ఒక్క బాటలో నడిచారని చెప్పి గతకాలపు మంచితనాన్ని స్మరించుకున్నాడు. నిజాం వ్యతిరేక పోరాటాన్ని తన కవితల ద్వారా వ్యక్తం చేసిన దాశరథిని తెలంగాణా కొదమసింహమని పేర్కొని, దాశరథికి తాను వారసుడనంటాడీ కవి. ఈ వారసత్వలక్షణం 'ధిక్కార స్వరం అనే మాట ప్రజాకవి కాళోజీని తలపింపజేస్తుంది.

'నాన్నగారనే' ఖండిక కవి ఆర్ద్ర హృదయాన్ని తెలుపుతుంది. మనిషి "దిక్కులు యింకిపోయే ప్రళయానికి ఇంధనం సమకూరుస్తున్నాడు. కాని, తనను తాను చదువలేక పోతున్నాడని గుర్తించిన ఈ కవి దృష్టి విశేషమైంది. వాత్సల్యం ఒకరిస్తే వచ్చేది కాదు... గుండె తలుపు ఒకరు తెరిస్తే విచ్చుకునేదికాదు. ఆ గుండెనదై పారినప్పడే వస్తుంది అనే సత్యాన్ని సహజంగా వెలువరించారు వెంకటయ్యగారు. కవి ఎప్పుడూ పీడితుల పక్షాన ఉండాలి. వాళ్ల చైతన్యం కోసమే రాయాలి. ఆ సత్యాన్ని కవితగా రాయటం వెంకటయ్య గారికి బాగా పట్టుబడింది. ఆత్మవేదనను అనువదించడమే కవిత్వం అని మహాకవి డాక్టర్ దాశరథి గారన్నట్లుగా వెంకటయ్య గారు సమాజంలో ఒక భాగమై యువతను నిలువుగా కుంగదీస్తున్న నిరుద్యోగ సమస్యను వస్తువుగా గ్రహించి రాసిన కవిత వాస్తవికత ప్రతిబింబించే విధంగా పచ్చగడ్డిలో మంటలు పుడుతున్నాయి. పసిడి మనస్సు ఎడారి ఒయాసిస్సును ఆవిష్కరిస్తుంది ఆశ బూడిదలో పోసిన పన్నీరులా నిరుద్యోగి ఆర్తిని హృదయం ద్రవించేలా ఒక శబ్దచిత్రంను కవి కళ్ల ఎదుట నిలిపారు.

## శ్రీ సంగివేని రవీంద్ర చిత్రణ - "అన్వేషణ"

కవి ఏ కాలం వాడైనా తన సమకాలీనంలోని సామాజిక స్థితిగతుల్ని తన రచనలలో చిత్రిస్తాడు. దీనినే ఈనాడు సామాజిక చిత్రణ, సామాజిక చైతన్యం, సామాజిక స్పృహ అనే రకరకాల పేర్లతో పిలుస్తూ వస్తున్నాం. ఈ చైతన్యాన్ని ఈనాడు ప్రపంచకవులందరూ గమనించారు. "తెరిచి ఉంచండి హృదయాల్ని స్వాగతించండి దాన్ని మూసుకుంటే మూర్ఖత్వం"... అన్ని హెచ్చరిస్తాడు. 'తెల్లారింది' అనే కవిత చాలా మంచి కవిత. మంచి ఎక్స్‌ప్రెషన్. 'కరువు' అనే కవితలో కష్టాలకు, కడగండ్లకు చితికిన బతుకులను బాగా చిత్రించాడు. రవి అనే కవికి తెలుగు భాష పై, పదజాలంపై ఉన్న సాధికారతను తెలియజేస్తుంది, మురికి వాడల్లోని జీవితాల్ని చిత్రించే మరో గొప్ప కవిత 'గుడిసే గోపురాలు!' భావుకత నిండిన కవిత్వం, ఆత్మాశ్రయ కవిత్వం, ప్రేమ కవిత్వం రాయడం కూడా రవికి బాగా తెలుసు...

'మనోగతం' అనే కవితలో "తెరిచి ఉంచాను హృదయం, నిలిచి ఉన్నాను నీకై, కలిసి రమ్మంది జాబిలి, కసిగ పిలిచింది ఈ చలి." భావ వ్యక్తీకరణ అత్యంత శక్తిమంతంగా ఉంది విధి. ఈనాటి సామాన్య జనజీవనంలో అత్యంత సాధారణమైన, అనివార్యమైన వస్తువైందన్న మాట. అంటే ప్రతిరోజూ, ప్రతిక్షణం ఎక్కడో ఒక చోట ఏడుపులు, ఆర్తనాదాలు, ఆక్రందనలు వినిపిస్తూనే ఉన్నాయి. అవి ఈ కవి వినగలుగుతున్నాడు. ఇంక దేశంలో ప్రశాంతత ఎక్కడ........?

సూర్యతేజం, రవి బింబం, చైతన్యానికి ప్రతీకలు. వీటిని కవి తరచుగా ప్రయోగించడం ద్వారా కవికి ఆధునిక కవితా ప్రతీకలపై సదవగాహన ఉన్నట్లు తెలుస్తోంది. భాషా ప్రయోగంతో మంచి పరిచయం ఉన్నట్లు తెలుస్తుంది. ప్రవాసాంధ్ర కవులలో రవికి మంచి భవిష్యత్తు ఉందని చెప్పవచ్చును.

"తెరచిన ఆ కనురెప్పల శబ్దానికి ఊరంతా లేచింది".... ఈ పాదాలు. దీనికి గంపెడు అర్థం చెప్పుకోవచ్చు. అక్షరాలు శబ్దించాయి. అది ధ్వని, ఆ ధ్వనికి ఊరంతా లేచింది. ఊరంటే ఊరు కాదు, ప్రపంచమే లేచింది. కవితా ప్రపంచమే కాదు, అర్థం చేసుకొన్న జనం లేచింది, విశ్వజనశక్తి లేచింది, ధ్వనికి ఈ శక్తి ఉంది. రాతిరి నాకు



నిద్ర రాలేదు చుక్కలన్నీ ఆకాశంలో ఆకలి కేకలు వేస్తుంటే రాతిరి రాత్రి కాదు, అనాచారాలతో, దురాచారలతో, మురికితో నిండి ఉన్న సమాజం ఈ రాతిరి.

రియాలిటీని కవి ధైర్యంగా అభివ్యక్తీకరించాలి. అప్పుడే కవికి విశేషంగా పాపు లారిటీ పెరుగుతుంది. అసమానతల రాక్షసరతికి బలైన ఓ గుడిసె ప్రసవ వేదన పడుతోంది.

భాషపై, కవితా మాధ్యమంపై అధికారం ఉన్న కవి కనుక శ్రీ సంగినేని రవీంద్ర వ్యంగ్యం అర్థానికే పరిమితం కాలేదు. కవికి రాయాలనే తపన - పట్టుదల - నిబద్ధత - తన చుట్టూవున్న సమాజం పట్ల చిత్తశుద్ధి, పరిశీలన, పుష్కలంగా వుంటేనే ఉత్తమ కవిత్వం ఉబికి రావడం సుసాధ్యం. ఆవేశం వస్తేనే కాని కవిత్వం రాదు. ఆవేశంలో రాసిందంతా కవిత్వం కాదు. అన్నది గమనించాలి. ఈ రెండూ సమన్వయంతో సాధించాడు.

కరెంటు లేదు మాకు కటిక చీకటిలో ఉంటున్నాం, కళ్ళు మూసుకునే వెలుగు కలలెన్నో కంటున్నాం మహత్తర సందేశం అందిస్తూ మేలుకొలుపుతున్న కవితలో నేను రాసే గోవుల వెనక గోపాలుడి లొల్లాయిపాట గుట్టల వెనక ఆకాశం కప్పుకున్న కాషాయ దుపట్టా పల్లె సౌందర్యాన్ని కనులకు కట్టినట్టుగా వర్ణించాడు. రవి, ముంబయి ప్రవాసాంధ్రుల దుఃఖాన్ని, ఇరుకిరుకు సంసారాల్ని, ఉరుకుల పరుగుల జీవితాల్ని, కల్లుదండాల్ని ఇలా ఎంతెంతో కవిత్వరూపంలో అందిస్తే కవిగా రవి నిలిచిపోతాడు. అన్వేషణ ముఖచిత్రం ఎంపిక చేసే చక్కని గ్రంథంగా మనస్సులో నిలుస్తుంది కళ్ళద్దాల వెనక, అనుభూతులు ఉన్నాయి. ఆవేదనల సంవేదం ఉంది, ఆవేశకావేశాలున్నాయి. వాటి వ్యక్తీకరణే ఈ కవితా సంపుటి.

## బాలుడి పయనం

"రాయిలా. . . . కోయిలా అని రమ్యంగా పిలిచేవాడు – లోయల రహస్యాలు వెలికి తీయడమా. . . మరణించి నడుస్తున్న ప్రతిమనిషిని ఎచటికోయి నీ పయనం అని ఈ కవి నిలదీస్తున్నాడు. . . మరి పూల వనాలలో. . . పరిమళాలదారులలో ఇన్నాళ్లు విహరించిన బాలకృష్ణారెడ్డి, సమాజాన్ని సునిశితంగా పరీక్షించి, నిశితంగా ఎదిగాడు. నీచ రాజకీయాలు రాక్షస విహారం చేస్తున్న సంఘటనలు. ఈ పయనంలో ఆయనను కలవరపెట్టాయి. ఇతిహాసంలో ఎచటికో ఈ మానవుని ప్రయాణం అని ప్రశ్నించుకున్నాడు. ఎప్పుడు మల్లెల దారులే సాధ్యం కావని పల్లేరుల దారులే ఎక్కువగా ఉన్నాయని గ్రహించి విస్తుపోయారు. ఈ ప్రయాణంలో మారిన దిశలు దర్శన మిచ్చాయి. ఇలాంటి కావ్యం రాయాలంటే కవికి గుండె ధైర్యం కావాలి. అది తన తండ్రి తనకిచ్చిన వరం. తను ఆచరించినదే సమాజానికి చెప్పాలి. నీతి, నిజాయితి, సచ్ఛీలత, సౌమనస్యం, ఈయనకి తండ్రి గారిచ్చిన ఆస్తి. మానవతను మరిచి నవత అంటూ వెర్రితలలు వేసే నేటి యువత, దీపాల చుట్టూ మూగుతున్న శలభాలు.

"జాతి ఎగురవేసిన పావురం జాలిగా అడిగింది. ఏ ఘనత ఆశించి తానింకా ఎగరాలని, ఏ గొప్ప సందేశాలు జగతికందించాలని విప్పారిన ఎర్ర గులాబి దీనంగా అడిగింది. ఏ నేత ఎదపైన తానింక గుభాళించాలని, ఏ జాతి ఘన కీర్తి వెలుగెత్తి చాటాలని" అంటూ చాచాజీ దివ్య హస్తాల్లోంచి విహాయసంలోకి స్వేచ్ఛగా ఎగరాల్సిన తెల్ల పావురం, ఆయన ఎద సింహాసనంపై నిత్యం హసించే ఎర్ర గులాబి. జాతికి పట్టిన దౌర్భాగ్యానికి విలపించడం. "సిరి కాటేసిన శిశిరానివి" పొమ్మన్నాడు. జీవించడం మరచిన జీర్ణ పత్రానివి చావమన్నాడు. గుండె చెడి పోవడం తప్ప. ఓ అర్ధరాత్రి అది గుట్టుగా ఆగిపోవడం తప్ప. గుండె చేతనే చెప్పించాడు. "గుండె గానం" నేను హృదయాన్ని నా దయా దాక్షిణ్యాల మీద బ్రతికే నీవు నన్ను నిర్దాక్షిణ్యంగా నిలిపి వేస్తున్నావు. చక్కని కవిత.

"ఏరులాగా పారుతున్నది అవినీతి– ఎంతకాలమని కిమ్మనకుంటాం, గుండె గుండెలో వెలుగించండి అఖండ జ్యోతి". "అశ్వ బిందువుని చిదిమి అణ్వాయుధాలు తయారు చేస్తున్న ఆర్తి వేదనని తడిమి అగ్ని గీతాలు రాస్తున్న" వినూత్న కవిత, కవి –



కార్మికులు, కర్షకులు పక్షాన చేరి శ్వేత పత్రం విడుదల చేశాడు. "వాళ్ళు జీవితాలను బిల్లుగా మార్చుకొన్న వారి స్వేద పతనంలో పులకించిన నేల, వీరి దైన్య స్థితిని చూచి పచ్చని ప్రతి ఆకు కన్నీరు పెడుతుంది. పైర గాలి జాలిగా మౌనం పాటిస్తుంది. ఆకాశం అరుణార్ణవమై శోకిస్తుంది, గుప్పెడు మట్టి గుక్కపట్టి రోదిస్తుంది. ఆవేదనల వెదజల్లుడు అక్షరాల శ్వాసలు వాటి బాసలు తెలుసు, పదాల వాలకం వాటి వాడకం తెలుసు పదాల ప్రమోదం తెలుసు వాటి ప్రహ్లాదం తెలుసు. భావ కవిత్వం పరిధుల్లోంచి బయటకు వచ్చి రానట్టు, నిజ సమాజంలోని బాధలను గాధలను, లలిత గీతాల వాకిళ్ళలోంచి గొప్పగా నేర్పుగా స్పృశించిన బాల కృష్ణారెడ్డిని అభినందిస్తున్నాను.

# జ్యోతిష్యం గారి "ఆత్మీయ స్పర్శ"

ఆత్మీయుల రాకను సూచించేది కాలింగ్‌బెల్ ఈ పుస్తకానికి వస్తే ఇందులోని చిట్టచివరి ఖండిక అదే ! కవితా విహంగానికి వస్తుకళ. రచనా కళ రెండూ రెండు పక్షాలు. కాకి గోలలోని వస్తువు మన సమాజంలో మనం నిత్యము చూస్తున్న అనుభవిస్తున్న గోలే ! తల్లిని తగలేయడానికి వంద రూపాయలు అప్పు పుట్టని పని మనిషి రంగమ్మ, మన సొంత ఇల్లే అయినప్పటికి మనదంటూ ఏమి లేని అపార్ట్‌మెంట్ కల్చర్, భర్తలు హతులు కాగానే రాజకీయ నాయకురాళ్ళవుతున్న భార్యలు, నేర విద్యకు యూనివర్సిటీలవుతున్న నేటి సినిమాలు, చిట్టెలుకలకు డిమాండ్‌ను పెంచుతున్న కొత్త కొత్త రోగాలు, తమ ఒంటి మీద చొక్కాలతోనే రైలు పెట్టెల్లో ఫ్లోరింగ్‌ను ఊడుస్తున్న బాల యాచకులు - వీళ్ళందరి గోలను గోలగా చెప్పారు.

కళ్లలో నీరు ఇంకిపోయిన రైతన్న భోరున ఏడ్వమని నింగిని ప్రార్థించాడు. అన్నపూర్ణను ఆవిష్కరిస్తున్న కర్మయోగి వాతాపి జీర్ణం అయిపోతున్నాడు. అన్న వాక్యాలు జ్యోతిష్మతి గారి ఉక్తివైచిత్రికి శ్రామిక జన పక్ష పాతానికి అద్దం పడుతున్నాయి. జ్యోతిష్మతి గారి కవితలో స్త్రీ అణిచివేత, పురుషాధిక్యం అనే ఫెమినిజం లక్షణాలు సముచిత రీతిలోను, సముచిత శైలిలోను కన్పిస్తున్నై. పురుషుడు స్త్రీ నిర్వహిస్తున్న బహు భూమికలను నిర్వహించలేక, తన అసమర్థతను కప్పిపుచ్చుకోవడానికే. శ్రమ శక్తి స్వరూపిణి ఐన స్త్రీని అబలవంటూ అణగదొక్కుతున్నాడన్నారు. కేవలం త్యాగాలు చేయడానికి పరిమిత మైనంత కాలము, హృదయం ప్రేమామృతభాండంగా ఉన్నంత కాలం స్త్రీకి ఈ అణచివేత తప్పదని జ్యోతిష్మతి గారి ప్రబోధం.

మీ ఇంట్లో ఇంకో ఆడ నలుసన్న లేక పోయే అనడంలో తరతరాలుగా మోసగింపబడిన స్త్రీ జీవితం పట్ల ఆమె స్పందన ఎంతో గుంభనంగా తొంగి చూస్తుంది "నీ హృదయం ప్రేమామృతభాండంగా ఉన్నంత కాలం నువ్వంటే మగాడికి అలుసే". . పెండ్లి తర్వాత మారిన ఇంటి పోరు ఆడదానిపై అత్తింటి అధికార ముద్ర అంటారు. వృక్ష వేదనని "దగాపడ్డా ధరిత్రి" కవితలో కరిగిపోతున్న ఓజోన్ కళని. అందాల



అక్వేరియంలో మనిషి పసితనంలోనే అలవరుచుకుంటున్న పైశాచిక ప్రవృత్తిని ఆర్ద్రంగా ఆవిష్కరించారు. "కిచ కిచ రావాలతో కల్లెదుట సందడి చేస్తూ మురిపించే చిన్నారి పిచుకపై కనికరం చూపించలేని వారు ఆఫ్రికా అడవుల్లో అంతరించి పోతున్న జంతు జాతిని పరిరక్షిస్తాడట."

యాబది పేజీల కవితల గోల లఘు కవితలు శుభసూచికగా గుర్తించి కాకి గోలగా చిత్రీకరించారు.

# అమృతలత గారి "అమృత వాక్కులు" ఒక పరిశీలన

ఆ కలం నుండి జాలు వారిన భావాలు మనల్ని నిలువునా తడిపేస్తాయి ! గుండెల్ని 'తడి' చేస్తాయి ! కోటేషన్స్‌లా మన నాలుకల మీద నడయాడాల్సిన వాక్యాలు కోకొల్లలు ! వంద తిట్లు చేయించలేని పనిని చిన్న ప్రశంస చేయిస్తుంది. పైసా ఖర్చులేకుండా. . . పదినిమిషాల్లో . . . ప్రజల నాలుకల మీదుగా ప్రపంచాన్ని చుట్టివచ్చే ప్రచార సాధనం – గాసిప్స్ ! ఏదో మొక్కుబడిగా పనిచేస్తూ. . . ఎప్పుడూ గడియారం మీద దృష్టి నిలిపే వ్యక్తి ఏ విజయాన్నీ సాధించలేడు ! 'మనసు'ని బ్రతికించే ఏకైక ఔషధం . . . 'ఆప్యాయత'. సోమరితనం, ఉదాసీనతల 'చెద' సోకితే. . . ఏ 'ఇజం' అది ఎంత గొప్పదైనా సరే మొదలంటా కుప్పకూలిపోతుంది ! ఎలా తట్టిలేపాలో – ఎప్పుడూ చెంపపెట్టు పెట్టాలో – దేన్ని కుండబద్దలు కొట్టాలో – అలా ఏ భావాన్ని ఎలా చేస్తే పఠితలు బాగా అర్థం చేసుకుంటారో, ఆ భావాన్ని అలా స్పృశించడం – ఆమెకే చెల్లింది. 'కార్లూ, బంగాళాలూ, అందం, డిగ్రీలూ ఏవీ ఇవ్వలేని 'డిగ్నిటీ'. . . మనిషికిచ్చేది. . . వ్యక్తి వినమ్రత ! ఇవి చాలు – రచనలోని హుందాతనాన్ని గ్రహించడానికి ! 'బాగుపడాలి' అనుకునే వాళ్లకి బాగా ఉపకరించే పఠనీయ గ్రంథం – అమృతవర్షిణి! చక్కగా, ముచ్చటగా, మూడు పేరాగ్రాఫుల్లో వివరించగలిగిన సామర్థ్యం వున్న రచయిత్రి అమృతలత ! వందతిట్లు చేయించలేని పనిని చిన్న ప్రశంస చేయిస్తుంది ! ఉద్యోగులకీ, పిల్లలకీ అప్పుడప్పుడూ ప్రశంస అనే 'టానిక్' ఇవ్వకపోతే వాళ్లు బొత్తిగా నిస్సత్తువుగా తయారువుతారు ! తెలంగాణ యాసకూడినది. తెలివైన వాళ్లూ, మేధావులూ అనుకున్న వ్యక్తులు ఎందుకూ కొరగాకుండా పోవడం. . . చూస్తూనే ఉంటాం ! చక్కని ఉదాహరణ. మనగొప్ప కోసం, భేషజం కోసం మన దగ్గరికి వచ్చిన వాళ్లని మన చుట్టూ పదే పదే తిరిగేలా చేస్తూ. . . వాళ్ల సహనాన్ని పరీక్షించకుండా, వాళ్లక్కావలసిన పనేదో వెంటనే చేసి పంపిస్తే, కనీసం ఎదుటి వాళ్ళ సమయాన్ని వృధా పుచ్చలేదన్న మంచి సంతృప్తయినా మనకు దక్కుతుంది ! అభిమానం, స్వాభిమానం, ఆత్మాభిమానం, ఆత్మగౌరవం. . . ఏ పేరైతేనేం . . . అన్నీ 'అహ'ం దెబ్బతింటే. . బుసకొట్టే నాగులే ! చక్కని వివరణ.

ఎదుటివాళ్ళు తననెంత రెచ్చగొట్టినా ఏ ఉద్వేగానికీ లోనుకాకుండా. . . వాళ్లను పసివాళ్ళుగా భావించి, తాపీగా సమాధానలిచ్చేవాడు. . . ఋషి. మనిషి



ఋషికాలేడేమో గానీ, 'మనీషి' కావడానికి ప్రయత్నిస్తే. . . పరిసరాలన్నీ ఆహ్లాదభరితంగా తయారవుతాయి ! అతడి సంస్కారం. . . అతడికో 'గౌరవాన్నీ' తెచ్చిపెడ్తాయి ! అమృత వాక్యాలు. ఏదో ఒకలా ఎదుటి వాళ్లని కనీసం జన్మకో శివరాత్రయినా ఆదుకోవడానికి ప్రయత్నించడమే. . . మనిషి. . . తోటి మనిషికి చేసే మహోపకారం ! దైవత్వ భూషణం రాగద్వేషాల్లో 'సంయమనం' పాటించే మనిషి. . . సంస్కారపు తేజస్సుతో సభ్య ప్రపంచానికి అధినేత అవుతాడు ! అమృత వర్షం – కురిసిన అమృతలత. మనిషి మనసులోని రాక్షసత్వం సిగ్గుతో ఆత్మాహుతి చేసుకుంటుంది. ఎక్కడ చూసినా సర్వ మానవ సౌభ్రాతృత్వం వెల్లివిరుస్తుంది ! చక్కని మానవత – వర్షం. తను వెలికితీసిన మాణిక్యాల తళతళలు చూసుకుని మురిసిపోతాడు ! మరుగునపడ్డ మరో వజ్రాన్ని సానపట్టేందుకు సంసిద్ధుడవుతాడు ! అభినందన చందనాలు. మన అభినందన తెలియచేస్తే . . . దాన్ని స్వీకరించిన వ్యక్తి రెట్టించిన ఉత్సాహంతో మరో అద్భుతాన్ని సాధించడానికి ఉద్యుక్తవుతాడు ! అభినందన కుసుమాలు, విరక్తి. . . వ్యక్తిని శక్తిహీనుణ్ణి చేస్తుంది ! నిస్పృహ . . జాతిని నిర్వీర్యం చేస్తుంది ! 'ఆశ'కు నిలువెత్తు అద్దం. మనకు జనాకకర్షణ శక్తి ఉందనీ. . . జనం మనమేం చేసినా గుడ్డిగా నమ్మేస్తారని భావిస్తే. . . జనం కీలెరిగి వాతపెడ్తారు ! 'కీ'. ఒక వ్యక్తి అంతర్దృష్టి అతడి 'మానసిక పరిణతి'కి చిహ్నమైతే – అతడి బాహ్యదృష్టి అతడిలోని 'సౌందర్య స్పృహ'కి సంకేతం. చక్కని అక్షర సౌందర్యం. ఇతర వ్యక్తుల్ని 'సభాముఖంగా' అసభ్య పదజాలంతో విమర్శించడం – సభ్య సమాజం అసహ్యించుకుంటుదన్న ఆలోచన ఆ నాయకుడికి లేకపోవడం శ్రోతల దురదృష్టం. అద్దంలాంటి నిజం. ఒకరి శ్రమని 'దోచుకోవడం' ఎంత తప్పో. . తన శ్రమని 'దాచుకోవడమూ అంతే తప్పు ! చక్కని వివరణ. తమ పనిని తాము సజావుగా, నిజాయితీగా చేసుకునే ఉద్యోగులు జాతి ప్రగతికి పట్టుకొమ్మలు ! నిజాయితీ నిర్వచనం. మన పరిచయస్తులు తమ ఆప్తుల్ని కోల్పోయి – పుట్టెడు దుఃఖంతో బాధపడ్తున్న సమయంలో. . . మన 'పరామర్శ' మండే హృదయాలకీ శీతల పవనంలా సోకి 'ఊరట' కలిగించాలే తప్ప – సానుభూతి వచనాలు. 'అసలు కన్నీళ్ళకీ – మొసలి కన్నీళ్ళకీ'. . . 'వెన్నుపోట్లకీ – తిరుగుబాట్లకీ' తేడా తెలుసుకోకుండా, ఆవేశకావేశాలకీ 'చేసుకున్న వాళ్లకి చేసుకున్నంత మహదేవా' అన్నట్లు అటు మింగలేకా ఇటు కక్కలేకా సతమతమయ్యే దుస్థితి ఓటర్లకీ ఏర్పడుతుంది. 'స్పృహలేని తనం' సభ్య సమాజానికి ఒళ్లు జలదరించేలా చేస్తుంది. ఆడవాళ్ళున్నారన్న స్పృహ కూడా లేకుండా – 'కుళ్ళు' జోకులతో జుగుప్స కలిగించేలా బూతులు మాట్లాడే 'విద్యావంతుల'ను జాతి క్షమించలేదు! సమాజానికీ కొరడాదెబ్బ. వాళ్ల కలాలని అభ్యుదయ పథంలో నడిపించేలా సమీక్షకుడు విశ్లేషించ

గలగడం. సద్విమర్శ ! ఎదుటివాళ్లు కవ్విస్తూ, గిల్లికజ్జాలు పెట్టుకుంటూ అదేపనిగా రాళ్ళు రువ్వుతున్నప్పుడు. . ప్రతిఘటించకపోవడం 'దున్నపోతు' లక్షణమనిపించు కుంటుందని తప్ప 'నిగ్రహం' అనిపించుకోదు ! చక్కని 'కీ' ఎవరెంత రెచ్చగొట్టినా రెచ్చిపోకపోవడం: సంయమనం ! మొదటిది ఉదాత్త లక్షణమైతే - రెండోది నాయకత్వ లక్షణం ! అద్భుతం. ఒకరి అంతరంగిక విషయాల్ని తాటికాయలంతేసి అక్షరాలతో పత్రికల్లో ప్రకటించడం - ప్రజలు దాన్ని లొట్టలేస్తూ చదవడం చూసినపుడు - విజ్ఞులైన పాఠకుల మనసు కలుక్కుమంటుంది - కకావికలమై పోతుంది. నేటి పత్రిక వ్యాపారరంగంకి చురక. ఒకదానితో తృప్తిపడి 'ఇహ చాల్లే' అనుకునే అల్ప సంతోషులు కారు. తమ శక్తి సామర్థ్యాలతో ఎప్పటికప్పుడు ఎవరి ఉహకీ అందని ఉన్నత శిఖరాలు అధిరోహించాలన్న తపన - అది సఫలీకృతం కావడానికి చేసే నిర్విరామ కృషి జీవనవిధానం. 'స్వయం ప్రకాశక శక్తి' ఉన్నవాళ్ళు - నమ్మకద్రోహానికి గురైనప్పుడు సంయమనం పాటించి - తగు సమయం కోసం నిరీక్షిస్తారే తప్ప తమకింత అన్యాయం జరిగింది. చక్కని జీవిత సత్యం. ఇండియాలో పుట్టి, ఇండియాలోనే పెరిగి - అమెరికాలో రెండేల్లు చదివి ఇరవై రోజుల కోసం వచ్చేవాడు. . . "అబ్బబ్బ ! ఏం డస్ట్ - ఏం పొల్యూషన్ ! ఈ ఇండియాలో ఇంకా వారం రోజులెలా గడపాలో ఏమో !? అంటూ డాంబికాలు ప్రదర్శించినపుడు - వినేవాళ్లకి చాచి లెంపకాయ కొట్టలన్నంత కంపరం.

సంపాదకీయాల జీవితసత్యాలు ! మొదటి పేజీ నుండి చివరి పేజీల వరకు చదువరులను తీసుకెళ్లి చక్కని అనుభూతి. లిఖిత సుగంధాలను పంచించిన అమృతాక్షారాల "అమృతలత" దీ గ్రెట్‌ఫైన్ కలం, తెలుగింటి గొప్ప రచయిత్రి - వీరి కలం నుండి మరెన్నో కావ్యాలు, గ్రంథాలు జాలువారాలని ఆకాంక్షించే ఒక సహ సంపాదక సహవ్రతుడు.



# రేగులపాటి "ఎగురే పావురం"

కవి రసరమ్యంగా ఆలోచించి మనోహరమైన కవితలను ప్రకటించి చైతన్య వంతులైన పఠితలకు నూతన ఆలోచన ధోరణులను అందిస్తారు. అదే. . . అదే రేగుల పాటి చేశారు. ఎలాంటి భావం ప్రకటించడానికైన పదాల ప్రయోగాన్ని బట్టి ఆ పదాలు పలికే తీరును బట్టి ఆ పదాలు పదుగురిలో పరిగెత్తే తీరును బట్టి రచయిత ప్రకటించిన భావం ప్రచారం పొందుతూ ఉంటుంది. విద్య పరిమళాల వ్యాప్తి పెరిగిన తర్వాత పద్యాలు పాఠ్య పుస్తకాలలో ప్రచారం పొందడంతో పాటు ప్రతిభా వంతులైన పఠితల మెప్పును కూడా పొందుతూ వస్తున్నాయి. గేయ ప్రక్రియ ప్రచార సాధనములతో విస్తారంగా ప్రచారం పొందుతూ శ్రోతలను అలరిస్తున్నది. పాటలతో కవితా ప్రక్రియల్లో వచనాకవిత ప్రక్రియ ఈనాడు అమితంగా ప్రాధాన్యం హెచ్చింది. అతితక్కువ నియమాలతో వచనాకవితల్లో చక్కని భావాన్ని రసవత్తరంగా ప్రకటించే అవకాశం ఉండడం "రచయిత తన భావాలను స్వేచ్ఛగా ప్రకటించవచ్చు. స్పష్టంగా ప్రకటించవచ్చు. సరళ సుందరంగా ప్రకటించవచ్చు. భావ గంభీరంగా ప్రకటించవచ్చు. మర్మగర్భంగా ప్రకటించవచ్చు". చక్కని ఉదాహరణ ఈనాడు వచనకవితలు వస్తున్నాయనే విమర్శ వినవస్తున్నది. పత్రికలు కవితలనే ఆదరించి ప్రచురిస్తున్నవి. వచనకవితా ప్రక్రియను తమ భావాలను ప్రతిభావంతంగా ప్రకటిస్తూ 24 కవితల గెలుపొందిన పావురం. 54 పేజీల నిండా గుభాలింపు కవితలతో కిషన్‌రావు. రేగులపాటి, చక్కగా పొందుపరిచారు. వారివి మరెన్నో పుస్తకాలు వచ్చాయి. ఒక్కొక్క కవిత ఒక కోణం నుండి ప్రకాశిస్తుంది, అభినందించ దగినవాడు కరీంనగర్ వాసి శ్రీ కిషన్‌రావు. రేగులపాటి స్వేచ్ఛా ప్రపంచ సాహిత్యంలో తెలుగు సాహిత్యం ఒకటి. అది అలనాటి నుండి విభిన్న కోణాల నుండి ప్రభావితమై కవుల కలాల నుండి జాలువారుతుంది. అది ఎగిరే పావురం.

మాకు తోడైన వాళ్ళు అక్షరాలే, అక్షరాలే మా ప్రపంచం. కాలే కడుపుల్ని జీర్ణించుకోలేని జీవితానికి తారతమ్యం ఎక్కడో? ముసుగు దొంగల్ని చూశాం - ముసుగులు కప్పుకున్న దొంగల్ని చూశాం, తేడా ఏమిటో? మదిలో మెదిలే ప్రశ్నలకు ఆశల అలలపై ఎగిసే స్వేచ్ఛా తరంగాలు. పండితుల కుటుంబాల్లోంచి వచ్చిన మేధావులం కాదు. డిగ్రీలను పుచ్చుకున్న పట్టభద్రులం భావాల్ని మాకు తెల్సిన భాషలో, మాకు తెల్సిన విధంగా వ్యక్త పరిచాం. సందేహాల్ని వ్యక్త పరిచే క్రమంలో అక్షరాలుగా

పేర్చుకున్నవే పెద్దలకు చూపిస్తే కవిత్వం అన్నారు. సాహిత్య ప్రపంచంలో కథ జీవితమైతే, కవిత మెరుపు. మెరుపు ఒక్కక్షణంలో మాయమౌతుంది. కవిత్వం కూడా అంతే మెరుపులా మెరువాలి. చైతన్యంలా ప్రసరించాలి. శాశ్వతంగా గుర్తుండాలి. అమ్మకెలా చెప్పను. ఇందులో కేవలం తొమ్మిది మాసాలే తన కడుపులో ఉండి వచ్చిన ఉన్న బిడ్డపై అమ్మకు ఎంతో ప్రేమ ఉంటే, తనలో పుట్టి, తనలో పెరిగి, తనలోనే ఎల్లప్పుడు ఉంటన్న కవిత్వంపై తనకెంత ప్రేమ ఉండాలి అంటారు. అక్షరం, విషయం చెబుతూ దైవానికైన మరణమున్నదేమో కాని అక్షరానికి లేదని, అక్షరానికి ఉన్న శాశ్వతత్వంపై తన ధృడ నమ్మకాన్ని తెలిపారు. అక్షరాలు అన్ని మతాలకు ఒకటేనని, మనం సృష్టించుకున్న పదాలే సువానలు, దుర్వాసనలు కలుగజేస్తాయని అక్షరానికున్న సమ భావన తత్వాన్ని, దానినుపయోగించే వ్యక్తి వైరుధ్య భావన తత్వాన్ని చెప్పారు. అక్షరం నా ఆయుధం అంటూ.... నా అక్షరం తెలుగు, నా అక్షర భావం వెలుగు అంటారు. "తెలుగు ప్రాచ్య ఖండపు ఇటలీ భాష" అని హెన్రి మారిస్ అన్న మాటలు, ద్రవిడ భాషలలో అత్యంత మధురమైనది తెలుగు అని కాల్డ్‌వెల్ అన్న మాటలు, రసభావముల సమర్పణ శక్తి యున్నందున, అమర భాషకును ధీటైన భాష అని విశ్వనాధం గారు మాటలు మత సామరస్యం, మత సహనం, లౌకిక వాదంపై ఇద్దరు రచయితలు ఒకే విధంగా స్పందించారు. అక్షరాలు అన్ని మతాలకు ఒకటేనని రఫీ గారంటే, నబీ గారి "పగిలిన మట్టి పెల్లల మీద మందిరం మాకొద్దు విరిగిన వెన్నుముకల మీద మసీదు మాకొద్దు" విద్యాలయం కావాలి. వైద్యాలయం కావాలి. మానవతవాదుల్లారా రండి అశోక ధర్మచక్రాన్ని అయోధ్య గల్లికి తోసుకొద్దాం అన్నారు. "స్వేచ్ఛ కోరే స్వరాలు, ఆంగ్ సాంగ్ సూకి అక్షరాలు అవుతాయి ఇప్పుడు గుండెలు గొంతుల్ని సవరించుకుంటున్నాయి. వుయ్ వాంట్ ఫ్రీడం మా స్వేచ్ఛను మాకివ్వండి" అని తీవ్రస్వరంతో చెప్పారు. నేను దళితున్ని కవితలో దళిత పదానికి ఇప్పుడు వాడుకలో ఉన్న అర్థం కులాల సంబంధంగా ఉన్నందున, అది తప్పు, అని అసలైన అర్థం కులంతో సంబంధంలేని దారిద్ర్యమేనని అవసరమైతే రాజ్యాంగం సవరిస్తానంటాడు. "చూడు చూడు లోకం కవితలోన రఫి ఇక్కడ మేధావి బిక్షమెత్తుకుంటాడు. మూర్ఖుడు కోట్లకు పడగలెత్తుతాడు" అని ఈ లోకాన్ని, సమాజాన్ని అద్దంలో పెట్టి చూపుతాడు. ఆగండీ నా రాజ్యాంగాన్ని నా చేతికివ్వండి. దళితుడంటే దరిద్రుడేనని సవరిస్తాను అంటాడు. బాబ్రీ వివాదాన్ని మూఢ వాదం కవితలో కవికి కావల్సిన లక్షణాలు ఇద్దరిలో పుష్కలంగా ఉన్నాయి. ఆ లక్షణాలను నిశిద్ధాక్షరాలతో ముందుకు వస్తున్నారు. అన్నం ఉడికిందా లేదా అని పట్టి చూసే మెతుకు లాగా ఉండాలి. అన్నాన్ని బాగానే వండారు. సాహితీ విందును ఆరగిద్దాం.



# బుద్ధుని జీవితం - ఒక పరిశీలన

రెండువేల అయిదవందల సంవత్సరాల క్రితం బుద్ధ భగవానుడు ఈ పుడమిపై అవతరించిన నాటి సాంఘిక, రాజకీయ పరిస్థితులెట్టివో, అలనాటి ధార్మిక జీవనం ఏ విధంగా ప్రవర్తిల్లేదో మనకు స్పష్టంగా తెలియదు.

ఆర్యుల పరిపాలన ఆరంభమయిన నాటి నుండి భౌతిక సంపద అభివృద్ధి జరిగిన మాట సత్యమే. వాణిజ్య, వ్యాపారములవల్లా, పరిశ్రమలవల్లా ఆనాడు విశేషంగా సంపదుత్పాదనం జరిగింది. క్రీస్తుపూర్వం ఆరు, ఏడు శతాబ్దాలలో భారతదేశంలో భౌతికవాదం ప్రారంభమయివుండవచ్చు. విశ్వమానవ కోటికి వెలుగుబాట తీర్చిన ప్రజ్ఞాననిధి పవిత్రజీవిత ఘట్టాలు భవ్యతీర్థాలనడంలో సందేహం లేదు.

హిమాలయ శ్రేణికి దిగువన, మగధకు వాయవ్యాన వున్న భూప్రాంతానికి శాక్య వంశజుడైన శుద్ధోధనుడు రాజు. కపిలవస్తు అతనికి రాజధాని. అతని భార్య మాయాదేవి. ఆ పుణ్యదంపతుల కడుపు పంటగా అవతరించాడు కరుణామూర్తి బుద్ధుడు. 563 ప్రాంతంలో శుద్ధోధనుడు కుమారునికి సిద్దార్థుడని నామకరణం చేసి మాయాదేవి అతడు జన్మించిన యేడవనాడే పరమపదించినది. శుద్ధోధనుడి రెండవభార్య గౌతమి కాపాడింది గౌతముణ్ణి.

ఒక రోజున అతడు వ్యాహ్యాళికై రాజమందిరం నుండి వెలుపలికి వచ్చి ఒక వృద్ధుని చూచాడు. మరొక రోజున ఒక రోగిని, ఇంకొక రోజున ఒక మృత కళేబరంనూ చూచాడు. తనకు కూడా ముసలితనం వస్తుందనీ, తాను కూడా రోగి కావచ్చుననీ, ఒకనాటికి చనిపోతాడని తెలియగానే గౌతమునికి యౌవన సుఖాలపట్ల విముఖభావం ఏర్పడ్డది. లోకంలోని ఈ అనంత దుఃఖానికి కారణం ఏమిటి? అది తొలగడం ఎలాగ? జనన మరణాల రహస్యం ఏమటి? అని తెలుసుకోవటానికి అతని హృదయం అర్రులు చాచింది. అర్థాంగినీ అనుంగుపుత్రునీ విడనాడి అర్ధరాత్రిలో అతడు అంతఃపురం విడిచి అడవులకు బయలుదేరాడు. కాషాయవస్త్రాలు ధరించి పరివ్రాజకవృత్తి నవలంబించాడు. నలభై అయిదు సంవత్సరాల పాటు బౌద్ధధర్మ ప్రచారం చేస్తూ బుద్ధభగవానుడు ఎనభై సంవత్సరాల నిండు బ్రతుకు బ్రతికి తుదకు కుసీ నగరంలో ఈశాన శతాబ్దం 148వ సంవత్సరంలో వైశాఖ శుద్ధ పూర్ణిమనాడు మహాపరినిర్వాణం చెందాడు.

ఆయన నిర్దేశించిన ధర్మచక్ర ప్రవర్తనం. 'పంచశీల' ప్రవచనం, నేటికీ సకల విశ్వానికి శాంత్యానందాల భిక్ష పెట్టుతున్నది. బౌద్ధధర్మంలో 'సంఘం శరణం గచ్ఛామి' అనలేని బౌద్ధేతరులు కూడా 'బుద్ధం శరణం గచ్ఛామి' అంటూ, 'ధర్మం శరణం గచ్ఛామి' సమాశ్రయిస్తున్నారు. అస్సక రాజుకు బౌద్ధదీక్ష ఇచ్చినట్లు విమాన పత్థు వ్యాఖ్యలో వుంది. అస్సకమన్నది తెలంగాణాలోని యిప్పటి నిజామాబాద్ జిల్లా ప్రాంతము. దీనికి పోతన రాజధాని. పోతన ఇప్పటి నిజామాబాద్ జిల్లాలోని బోధన్.

నాగార్జునుని కొండ, గుమ్మడిదుర్రు, జగ్గయ్యపేట, రామిరెడ్డిపల్లి మొదలయిన చోట్ల ఉన్న స్తూపశిల్ప చిత్రాలు కూడా ధనకటక ప్రకారం శిల్పచిత్రాలకు తీసిపోయేవి కావు. తెలుగు శిల్పకృతులలో అమృతం చిలికింది. బౌద్ధక్షేత్రాలలో స్తూపశిల్ప చిత్రాలు పట్టి నీరస ప్రతిమలయితే తెలుగు మహాయాన మవతరించి ఆదిమ బౌద్ధము స్వరూప స్వభావములను పూర్తిగా మార్చివేసింది.

నాగార్జునకొండ మనకు బహుకాల పరిచితమైనను దాని యథార్థ స్వరూపం గోచరించుటయు దాని మహత్త్వము గ్రహింపబడుటయు నాగార్జున సాగర నిర్మాణము నిశ్చితమైన తరుహాతనే. మన జన సామాన్యము ప్రాచీనత్వము తెలుపవలసి వచ్చినపుడు 'ఇక్ష్వాకుల నాటి' కాశీహిందు విశ్వవిద్యాలయము చరిత్రోపాధ్యాయులు భట్టాచార్యులవారు 'కాళిదాసుని నాటి కళింగ నగరమేదియై యుండును. ఇప్పుడు దీపస్తంభము (లైటు హౌసు)నకును. సముద్రమునకు నడుమ ఉన్న యొక దిబ్బ త్రవ్వింపగా నక్కడఁగొన్ని ప్రాచీనములైన శిథిల శకలములును గొన్ని నాణెములును దొరికినవి. (ఎపిగ్రాపిస్టు ఆఫ్ ఇండియా).

ఆంధ్రదేశమునందలి బౌద్ధక్షేత్రములన్నింటిలోను అమరావతి మిక్కిలి ప్రసిద్ధి చెందినది. అది కృష్ణానదీ దక్షిణతీరమున సత్తెనపల్లి తాలూకాలో గుంటూరున కిరువది మైళ్లు ఉత్తరముగా నున్నది. నేడది యొక కుగ్రామముగా యున్నను పూర్వ మీ అమరావతి, ధరణికోట కలిసియున్న ప్రదేశములో ధాన్య కటకమును గొప్ప నగరముండినది. 200 సంవత్సరములు పరిపాలించిన శాతావాహనులకు రాజధానీనగరముగా విరాజల్లినది. గుంటూరు మండలములో నున్న నాగార్జున కొండ కూడా ప్రాచీనాంధ్ర క్షేత్రములలోఁ ప్రసిద్ధిగాంచినది. బౌద్ధమతమున మాధ్యమికవాద మనునొక వాదమును నెలకొల్పి సుమారు అరువది సంవత్సరముల పాటిచ్చటి బౌద్ధవిశ్వవిద్యాలయమును బరిపాలించిన సుప్రసిద్ధ బౌద్ధాచార్యుడగు నాగార్జునాచార్యుని పేరటి నా కొండకు "నాగార్జునకొండ"యని పేరు కలిగినది. ఈ కట్టడముల శిల్ప మమరావతీ శిల్పములు బోలియున్నది. అచ్చటఁ



గనుగొనఁబడిన ప్రాచీన శిథిల నిర్మాణములో మహాచైత్యమొకటి. అది యొకయున్నత ప్రదేశమున నిర్మింపబడినది. దాని నడిమి కొలత డెబ్బది నుండి యెనుబది యడుగులుండును. 'విశ్వచక్రపు నాభికిఁజుట్టిన పునః పునరావృత్తము లూన యొక్క కేంద్రకవృత్తములకు సంకేత' ఆనందుడు బోధిసత్యుని వెంట తుషితలోకంలో ఉండేవాడని బౌద్ధగాథలు చెబుతున్నవి.

బుద్ధత్వం లభించిన తరువాత ఇరవై సంవత్సరాల వరకూ బుద్ధభగవానులకు ప్రత్యేకమైన ఉపస్థాపకుడు అంటే ప్రైవేట్ సెక్రటరీ ఉండేవాడు కాడు. ఒకప్పుడు నాగసమాలుడు, మరొకప్పుడు ఇతర భిక్షువులు, భగవానుల పాత్ర చీవరాదులు వెంట గొని వచ్చేవారు.

రెండవ యుగము ప్రాకృతములు, మూడవ యుగము ఆధునికార్యభాషలగు హిందీ, బెంగాలీ, మరాఠీ, గుజరాతి మొదలగు భాషలు నిదర్శనములు, పాలీ మధ్య యుగమునకు చెందిన ఒక ప్రాకృత భాషాభేదము. అశోకుని శిలా శాసనమందలి భాష, హీనయాన బౌద్ధమత గ్రంథములలోని పాళీభాష ప్రాకృతభాషలలో మిక్కిలి ప్రాచీనములైనవి. పాళీ శబ్దమునకు పంక్తియని యర్థము. దక్షిణమందుండు బౌద్ధులు తమ పవిత్ర మత గ్రంథములకు పాళీయని పేరిడిరి. ఇప్పుడు భాషాపరముగా వాడబడుచున్నది నాగార్జున నామధేయములు వ్యాసులవలెనే చరిత్రయందనేకులు కానవచ్చుచున్నారు. హ్యుయన్‌త్సాంగు తన భారతదేశ యాత్రానుభవములను గూర్చి వ్రాయుచు నాగార్జునుండను నొక సిద్ధుఁడు తనకు సమకాలికుడైన యొక శాతవాహన చక్రవర్తి యొక్క కోశాగారమును ధన, రసవాదసిద్ధి ప్రభావమున బంగారముతో నింపినట్లు వ్రాసియున్నాడు. శ్రీపర్వత ప్రాంతమున నొక గొప్ప బౌద్ధసంఘారామమును స్థాపించి, నాగార్జునుడును, నలందా విశ్వవిద్యాలయాధ్యక్షుఁడగు మరొక నాగార్జునాచార్యుడు చరిత్రలో గానవచ్చుచున్నాడు. నాగార్జునాచార్యుఁడు గాని ధాతువాదశాస్త్రము నధికరించి వ్రాసిన గ్రంథము లేవియు నేడు మనకు లభించుట లేదు. రసాయన శాస్త్రమును వృద్ధిఁబొందించిన వారిలో గోవింద భిక్షువు, సోమదేవుఁడు, నాగార్జునుడు, రామచంద్రుడు, స్వచ్ఛందభైరవుడు, 'రసరత్నాకర' గ్రంథము పేర్కొనఁదగినవి.

ఆచార్య నాగార్జునుడు బౌద్ధమతమున 'మధ్యమక' సిద్ధాంతమును వెలయించినవాడు. క్రీస్తుశకము ఆఱవ శతాబ్ధికి చంద్రకీర్త్యాచారుడు 'మధ్యమ కావతార'మను నొక గ్రంథమును రచించెను. చైనా, టిబెట్టు భాషలలోనికి బరివర్తిత మయినది. నాగార్జునుని మధ్యమ కారికలపై బౌద్ధపాలిత, భావివేకుడు, చంద్రకీర్తి

యనువారు భాష్యములను రచించిరి. వీరు నాంధ్రులేయగుట విశేషము. బుద్ధుని గూర్చిగాని, సత్యమును గూర్చిగాని, ధమ్మపతమును గూర్చిగాని ఈ మహాసభలో నెవరిమనస్సునను సందియముగాని, తప్పభిప్రాయములు గాని లేవని తథాగతుని అభిప్రాయంతో అందరు ఏకీభవించవలెను.

ఆచార్య నాగార్జునుడు అమరావతి నుంచి మహాయాన బౌద్ధమతాన్ని ప్రారంభించారు. శాతవాహనుల కాలంలో కృష్ణా, గుంటూరు జిల్లాలో మహాయాన బౌద్ధమతం మహోన్నతంగా వెలుగొందింది. అమరావతిలోని శ్రీపర్వతంపై ఆచార్య నాగర్జునుడు ఓ విశ్వవిద్యాలయాన్ని నిర్మించాడు. క్రీస్తు పూర్వం 3,4, శతాబ్దాలలో దేశవిదేశాల నుంచి బౌద్ధభిక్షువులు ఇక్కడకు వచ్చి విద్యనభ్యసించేవారు.

నిరాకార, సాకార సాధనను బోధిస్తుంటే తంత్రయానం వైదిక కర్మాచరణకు కాస్త దగ్గరగా ఉంటుంది. సాంఖ్యాయన పద్ధతి, మాండూక్యోపనిషత్, జైనమత ధర్మాలలోని సూత్రాతంత్రయాన మత నిర్మాణాన్ని ప్రభావితం చేశాయి. విశ్వానికి సంబంధించింది. అది సూర్యచంద్రులు, భూమండలం, పర్యావరణాన్ని గురించి తెలుపుతుంది. రెండో చక్రం మానవ శరీరాన్ని గురించి చర్చిస్తుంది. పరిపూర్ణజ్ఞానసిద్ధి, వ్యక్తిత్వ వికాసం కాలచక్ర అర్చన ప్రధాన లక్ష్యం కాగా మూడోది అతిముఖ్యమైన చక్రం బుద్ధునికి, కాలానికి, భగవంతునికి ప్రతీకగా ఖాళీగా ఉంటుంది. దలైలామా వివిధ దేశాలలో ప్రతి సంవత్సరం కాలచక్ర ప్రవచనాలు సాగిస్తూ వస్తున్నారు. అమరావతిలోని కాలచక్ర ప్రవచనం వరుసగా 30వది. గత సంవత్సరం అయన భారతదేశంలోని పశ్చిమబెంగాల్, హిమాచల్‌ప్రదేశ్‌లలో రెండుసార్లు, ఆస్ట్రేలియాలోని సిడ్నీలో ఒకసారి కాలచక్రప్రవచనం చేశారు. దలైలామా కాలచక్రం ఉనికిని గురించి చెబుతూ "కాలచక్రం" విశ్వంలో ఎక్కడో ఉంది. అయితే ఖచ్చితంగా భూమిపై మాత్రం లేదు !!

*(జనవరి 2006, భావవీణ మాసపత్రిక – గుంటూరు)*



## ఈతకోట సుబ్బారావు అక్షరలిపిలో "హృదయలిపి"

"నవత" కాలం నుంచి ఆధునిక దృష్టి పుష్కలంగా ఉండేది. ఎన్నో రచనలు చేశాడు. ఎన్నెన్నో కార్యక్రమాలు నిర్వహించాడు. ఎందరినో జాగృతుల్ని చేశాడు. 'హృదయలిపి'లో కవితాలిపి' చెప్పాడు. ఒక అత్యాధునిక కవికి కావలసిన సరంజామా సంక్షిప్తీకరించాడు. కవి సమకాలీన సంఘటనలకు సరియైన రీతిలో స్పందించడం ఈతకోట సుబ్బారావులోని సమకాలిక స్పృహకి నిదర్శనం. ప్రపంచీకరణ ప్రభావం గ్రామాల్ని ఎలా ధ్వంసం చేస్తుందో సుబ్బారావు సూక్ష్మంగా సూటిగా ఒకే ఒక్క వాక్యంలో "ఊపిరి పీలుస్తున్న శవం పల్లె" కులాల్నీ, కంచెల్నీ పటాపంచలు చెయ్యాలనే అభ్యుదయ గుణం ఉంది. "సమూహాలమై జీవించటమే మానవ కులానికున్న ఏకైక లక్ష్యం" విశాల దృష్టిని స్పష్టంగా ప్రకటించాడు. సుబ్బారావులో ఛిద్రమౌతున్న మానవ సంబంధాన్ని కవిత్వం ద్వారా పసిగట్టే నేర్పు ఉంది. "గాయపడ్డ ఈ నాలుగ్గోడల మధ్య మాట్లాడే బతుకు పుస్తకాల్లోని పేజీల్లో ఎక్కడా నెమలీకల్లేవు అన్నీ ఉమ్మెత్త పూలే !" విహీన వారసత్వాల మీద చెంపుపెట్టు ఈ కవిత. వస్తువును బలమైన కవితగా మలిచే శక్తివుంది. అభివ్యక్తిలో వైవిధ్యం వుంది. రూపపరంగా పఠితల్ని ఇబ్బంది పెట్టే సంక్లిష్టత లేదు. ప్రతి కవిత హాయిగ చదివిస్తుంది. ఆలోచింప చేస్తుంది. అనుభూతినిస్తుంది. ఒక మంచి కవికి ఇంతకంటే ఏం కావాలి? వ్యక్తుల వ్యక్తిత్వాన్నీ, ఆ పాత్రల ప్రత్యేకతల్నీ ఎంతో కళాత్మకంగా కవిత్వీకరించగలడు. "నీ వేలి కొసల్లో ప్రాణరసం పురుడు పోసుకుంటుంది." "హృదయలిపి"తో కవితా రంగం మీదికి వచ్చిన సీనియర్ సుబ్బారావును మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను. రూపనిబద్ధతకు హర్షం ప్రకటిస్తున్నాము. సింహపురి గత వైభవకీర్తిని ఆధునిక కాలాన సింహభాగాన నిలబెట్టాలని ఆశిస్తున్నాను. కవితామృత ప్రవాహాన్ని తన వెనకే నడిపించుకొచ్చిన భగీరథుడు – అవసరమైనచోట పూల సౌకుమార్యాన్నీ, అత్యవసరమైన చోట కత్తుల కరకుదనాన్నీ అక్షరాలకు తాపగల నైపుణ్యం అతనికి కరతలామలకం. "కన్నీటి చుక్కకంటే నీటి చుక్క ఖరీదైపోతుంది" – "కాలాన్ని ఖైదీ చేసిన జైలు గోడకి వేలాడుతున్న ఫోటో" చదవదగ్గ హృదయలిపి కవిగా కవిని భుజంతడుతున్నాను.

# సాహిత్య సమాలోచనలో "నానీ"ల ఒక కోణం

వర్తమాన తెలుగు కవిత్వంలో నానీలు ఎటువంటి ఆర్భాటాలు లేకుండా సహజంగా ఎదిగి, ఉద్యమస్థాయిలో వ్యాప్తి చెందాయి. ఏదో ఒక రాయి విసిరినట్టుగా కాకుండా వడిసెలలో పెట్టి విసిరిన రాయి లక్ష్యాన్ని ఛేదించినట్టుగా నానీ రూపుదిద్దుకుంది. నానీల సృష్టికర్త డా॥ ఎన్. గోపి ఒక నానీలో అన్నట్లుగానే నాలుగుపాదాల నానీ కవితారూపం కాలపరీక్షకు నిలిచి దూసుకుపోతున్నది. వీలునామాలోని నానీల ఆల్కేమీ దేశమంతా పంచుకుంది. 'ఓం'కారనాదం ఒకే అక్షరం. కానీ విశ్వమంతా ప్రతిధ్వనించింది. వేలకొద్ది నానీలు ఈనాడు సాహిత్య వీథుల్లో విహరిస్తున్నాయి. యశశ్రీ రంగనాయకి 'సూరీడి చెంపలు'తో మొదలైంది. చిల్లర భవానిదేవి తరువాత నానీల్లో ప్రవేశించిన రెండో కవయిత్రి ఈమె. 'భవానీ నానీలు స్త్రీ చైతన్యం పార్శ్యాన్ని నానీలకు చేర్చటం ఈమె ప్రత్యేకత. నానీలకు ఉన్న ఆకర్షణ శక్తి దేనివల్ల? "ఉద్యమాల్నీ వాదాల్నీ వొదిలేసి వైయక్తికంగా పరిశీలిస్తే డా॥ ఎన్. గోపి నానీలు తెలుగు కవితా ప్రస్థానంలో ఒక 'ల్యాండ్ మార్క్' అని 99లోనే చింతపట్ల సుదర్శన్ ప్రకటించారు. నాలుగు పాదాలూ, రెండు యూనిట్ల పరస్పర సంబంధం, అక్షరసంఖ్యకు హేతువు ఒక కుదిరిన పరిమాణం. సాగదీయకుండా మరీ కుదించకుండా ఒక క్రమశిక్షణ. అయితే భావం బలికాకుండా 5 అక్షరాల వెసులుబాటు. ఈ వెసులుబాటు మన ఉపజాతుల్లో వున్నదే. నానీలు లక్షణాలు పాటించడం, కవికి నిజాయితీ ముఖ్యం. నానీల రచన కీర్తికి మంచినానీ రాయటం అంత సులభం కాదు. పిల్లల్ని నానీల రచనకు ప్రోత్సహించండి. కవుల సంఖ్య పెరిగితే దుర్మార్గుల సంఖ్య తగ్గుతుంది. భారతదేశంలో తెలుగులో తప్ప మరే ఇతర భాషలలో కవితా నిర్మాణానికి ఇంత రూపవైరుధ్యం లేదు. సంస్కృతవృత్తులు, దేశీయమైన ఛందస్సులు, మాత్రా సమక ఛందస్సులు, గేయాలు, అర్ధఛందోగేయాలు, అక్షర సమక ఛందస్సులు, వచన కవిత (అనిబద్ధ/ముక్తఛందాలు), ముత్యాలసరాలు, నానీలు, హైకూలు ఇలా ఆంధ్రకవికి తన కవిత్వానికి రూపనిర్మాణంలో అనంత వైవిధ్యభరితంగా వెసులుబాటు ఉంది. నానీలలోని సంక్షిప్త స్వరూపం ఈనాటిదేం కాదు. చిన్న పద్యాల శతకాల్లో వేమన, సుమతి వంటివి ఉన్నాయి. గురజాడ ముత్యాలసరాలు, పారశీక పంక్తి నియతి ఛందాలు (దేవులపల్లి కృష్ణశాస్త్రి రాసినవి), సినారె గజళ్ళు, ఆరుద్ర



కూనలమ్మ పదాలు ఈ కోవలోవే. ప్రాకృతంలోని గాథా ఛందం వంటివి వేల సంవత్సరాలుగా చలామణిలో ఉన్నవే. మెరుపులు తళుకులు, పదునైన పదాలు, వ్యక్తీకరణ శిల్పం కవితా నిర్మాణానికి వలసిన కొన్ని సామగ్రులు. వెయ్యేండ్ల తెలుగు సాహిత్యంలో 20వ శతాబ్దం విశిష్టమైనది. మట్టి మనుషుల నుండి మహాకవులను రూపొందించుకున్నది. సామాన్యులను మాన్యులైన మహారచయితలుగా తీర్చిదిద్దింది. వాడుక భాషకు పట్టం కట్టింది. మనిషిని సాహిత్యానికి మకుటధారిగా మలిచింది. సమాజాన్నీ, సామాజిక సమస్యలను సాహిత్యానికి ఇతివృత్తం చేసింది. నానీల రచన సౌలభ్యంగా ఉండటం. అనుయాయులు (ఫాలోయర్స్) ఉండటం. అన్ని భావజాలాలకు అనుకూలంగా ఉండటం. అన్ని వయసులవాళ్లని, అన్ని ప్రాంతాలవారినీ ఆకట్టుకోవడం. కాబట్టి కవులను తయారుచేయడం / ప్రోత్సహించడం. బాగా స్థిరపడటం. తెలుగు సాహిత్యంలో నానీలు ఒక ప్రక్రియగా స్థిరపడటం అటువంటిదే. రెండు దశాబ్దాల కింద మినీ కవిత విషయంలో జరిగిన రాద్ధాంతంతో, వివాదాలతో సమర్థకులకూ, ప్రత్యర్థులకూ మధ్య జరిగిన వ్యాస, కవితాయుద్ధాల వాతావరణంలో నానీల అవిర్భావ వికాసాలను పోల్చి చూస్తే, ఒక ప్రక్రియగా నానీ సాధించిన విజయం అర్థమవుతుంది. ఎక్కడి ఆలోచనలకి మనం మన మెదళ్ళని అంకితం చేస్తున్నామో, ఎక్కడి భాషకు మన గుండెను జతపరుస్తున్నామో అక్కడ వుంది దేశీయత అంటారు చెన్నప్పగారు. దేశీయతకు ఛందస్సులోనే కాదు అన్ని అంశాల్లోను పెద్ద పీట వేసినవి అన్ని నానీల సంపుటాలు. ఉదాహరణకు తొలకరి చినుకులు, బొంబాయి నానీలు, గూడు వదిలిన గువ్వలు, నూరు తెలంగాణ నానీలు, చిగురునవ్వు, పాలకంకి, అడుతులు, గోరంత దీపాలు, పాయలు, పచ్చబొట్టు కలుకుంట నానీలు పేర్లను బట్టి నేటివిటీని సూచిస్తున్నాయి. ఇప్పటి వరకు నానీల సంపుటాలన్నిటిని క్షుణ్ణంగా పరిశీలిస్తే వస్తువు విషయంలో ఒక సారూప్యత స్పష్టంగా కనిపిస్తుంది. వస్తువులైన ప్రపంచీకరణ, సామ్రాజ్యవాదం, వరల్డ్‌బ్యాంక్, పల్లెజీవనం, గూండాగిరీ, జలరాజకీయాలు, మతం, మందిరాలు, కంప్యూటరైజేషన్, కార్పోరేట్‌వైద్యం, ప్రకృతి విపత్తులు, టీవి - సినిమాల ప్రభావం. రైతుల ఆత్మహత్యలు, ఉగ్రవాదం, స్కామ్స్ మొదలైన వాటి మీద చాలా మంచి నానీలు రాశారు. చలపాక ప్రకాశ్ నానీల వైవిధ్యం చక్కగా వివరించారు. "తెలుగు సాహిత్యంలో నానీలు ఒక ప్రక్రియగా స్థిరపడటం, ఇంత మంది కవులు ప్రభావితమై పుస్తకాలు ప్రచురించడం, ఈ ప్రక్రియకు వ్యతిరేకులు ఎవరూ లేకపోవడం చూస్తే నానీలు సాధించిన విజయం అర్థమవుతుంది" అని స్పష్టమైన సాహిత్య తీర్పును ప్రకటిస్తున్నారు.

# మానస ఉల్లాసం - సరోవర స్నానం

కవిరాజహంస. గజానన్ తామన్ కవితాజహసం. ఈ హంసకు ఒక భాషకాదు. బహుభాషలు వచ్చు. మరాఠీ, హిందీ, ఉర్దూ, ఇంగ్లీషు సంస్కృతమూ. . . ఇవన్నీ వచ్చు. మానససరోవరంలో ఈదుకుంటూనే - అలవోకగా వేదోపనిషత్తుల్నీ, వాల్మీకి వ్యాసుల రామాయణ భారతాల్ని, ఇంగ్లీషులో టెన్నిసన్, షెల్లీ, బ్రౌనింగ్ ప్యాస్టర్‌నాక్, తెలుగులో శ్రీశ్రీ, దేవులపల్లి, కరుణశ్రీ, తిలక్, దాశరథి, సి.నా.రె. మొదలైన మహాకవుల రచనలనూ మధురంగా గానం చేస్తుంది. కన్ననేల, ఉన్ననేల, చిన్ననాటి గురుమిత్రులు, ప్రోత్సాహక ప్రచార్యులు, ప్రచురణకర్తలు, తన గేయాల కమ్మగా గానం చేసిన విమలగాంధర్వం వినిపిస్తుంది. శబ్దవైభవం నోచని అకించనుడై శిలలా నిలబడగిపోతాడు గజాననకవి. తనను అనుక్షణం మౌనంగా అనుసరించే ప్రౌఢగా క్రీనీడగా మిగిలిన అర్ధాంగికోసం అలమటించిపోతాడు. ""బీట్'తో 'పాప్'తో బేజారెత్తిపోయిన జనం త్యాగయ్య, తాన్‌సేన్‌లకు మళ్ళీ ద్వారాలు తెరవాలి" సామాజికస్పృహతో ఆధ్వర్యం సాగించే ఆదర్శజీవులతో తానూ కలిసి జనవాహినిలో ఒకడుగా అయిపోతాడీ కవి "నా కవన మొకసూనము, ఒక విహంగము, ఒక గాలి, నవజాత, అందుకే నా కవిత ఆత్మరత" అంటాడీ తత్త్వకవి హృదయవీణను హాయిగా మీటుకొంటాడు. ఈ కవి "ప్రావుకోసం ప్రభుభక్తిని ప్రకటించడం" "భవిత కొరకు విద్రోహిగ వికటించడం" వంటి అల్పపుపనులకు పాల్పడదు "స్వగతం"గా గజల్‌గానం చేశాడు గజానన్. యక్షగానశైలిలో 'పాగ్విభూషణ ! పరమతోషణ ! అంటే ప్రారంభించిన గేయంలో 'బుష్' మహోదయ సదయుడంపిన దూత దూతికలను, కార్గిల్, కాశ్మీరుల ఉదంతాలను ప్రస్తావించి, భూపాలరాగంలోనే ప్రభాతగీతం గానం చేశారు. కవి. బుజ్జుంత్రంతో ఆరంభమై, కన్యక వివాహితమై మాతృమూర్తిగా దర్శనమిచ్చినప్పుడు మహిళా మహోద్యమ ధ్వనులనీ వినిపిస్తుంది. 'నడక' నేర్చిన సత్కవి గొంతువిప్పి, చంపకోత్పల శార్దూల మత్తేభ మాలినీ లయగ్రాహిమధ్యాక్కరాదుల్లో దిగ్దిగంతాలు ప్రతిధ్వనించే గజల్ గానం చేస్తూ 'నేను సైతం నడవనేర్చాను' "మనిషి మానపాన మరల మధుమాసలు కదలాడని! ఆందమైనవేళ రాని అమృతవృష్టి కురిపిసోని !" అనుకున్నాడు గజాననకవి. "మానవతావాదాన్ని కూడా అధిగమించి సమస్తజీవజగతికి అభ్యుదయప్రదమైన



జీవనవాదం వైపు పయనించాలి కవిత్వ"మంటారు. కవిత్వం ఇంకొకని కవిత్వానికి అనుకరణ కారాదు. సిసలైన కవిత్వం చేవ్రాలు వంటిది. హృదయస్పర్శి కావటంతో పాటు కవిత మేధాస్పర్శి అవటం ముఖ్యమనే సంగతి గుర్తుంచుకోవాలి. ఉత్తమ కవిత్వం భావనాలోచనల హృదయంగమసమ్మేళనం. కవిత ఏ సిద్ధాంతానికి ప్రచారసాధనం కారాదు. కష్టమైన పని అయినప్పటికీ, వైతాళికత్వాన్ని ఆచారత్వాన్ని విడనాడాలి. మూల్యనిబద్ధత కలిగినదై ఉండాలి. మానవతావాదాన్ని అధిగమించి సమస్తజీవజగతికి అభ్యుదయ ప్రదమైన జీవనవాదం వైపు పయనించాలి. మానవుణ్ణి అంతర్ముఖుణ్ణి చేసేది కావాలి. తిట్లకు దీవనలకు అతీతమైంది కావాలి. ప్రాదేశికముద్రను చెరిపి వేసుకొని ఈ సువిశాల జగత్తును చిన్న గ్రామంగా చూడగలిగే హృదయవైశాల్యం కలది కావాలి. 101 పేజీల సరోవరలోయల 26 అడుగులు వేస్తే మానవ సరోవరం దర్శనమిస్తుంది. అదే గజానన్ తతోమెన్ అవ్యక్త గంభీరం.

# కవిత్వ క్రీడ "నూట పదహార్లు"

## డా॥ రావి రంగారావు - సంకల్పం

"సూక్ష్మరూపంలో మోక్షం చూపే మినీ కవిత"ను మనం సహృదయులమై అర్థం చేసుకోవాల్సిన అవసరం ఎంతయినా ఉంది. ఇది యంత్రయుగం. తీరికలేని ప్రజలు హడావుడిగా తమ తమ పనులకు వెళ్ళిపోతున్న కాలం. అలాంటి వాళ్ళకు పెద్ద పెద్ద కావ్యాలను చదవాలంటే తీరికతో పాటు ఆసక్తి కూడా కలగటం లేదు. నేడు మినీ కవిత చారిత్రక అవసరమనిపిస్తుంది. కవిత్వం చదివే పాఠకుల సంఖ్య తగ్గుతున్న ఈ రోజులలో కొత్త పాఠకుల్ని పెంచుకోవాలి. పాత పాఠకులతో పాటు కవిత్వం చదివి సంతోషిద్దామనుకునే కొత్త పాఠకులతో కూడా ముందు మినీ కవితల్ని చదివించటం గనక చేస్తే వారికి కవిత్వం పట్ల ఆసక్తి పెంపొందటమే కాకుండా, భావాస్వాద హృదయాన్ని పెంపొందించుకోగలరు. చక్కగా 'మినీ కవిత'రాసే సామర్థ్యం అలవడిన కవి తరువాత కథా కావ్యం రాసినప్పుడు ఆ కావ్యం అనవసర పదాడంబరం లేకుండా, పటిష్టంగా, భావ గాంభీర్యంతో వెలుగొందటానికి అవకాశం ఉంటుంది. కథా రసం యొక్క అనుభూతిని పాఠకుడు పొందలేడనే ప్రధానమైన ఒక విమర్శ మినీ కవితను గురించి మనకు ఎక్కువగా ఈనాడు వినపడుతోంది. కవిత్వం ఏదేని ఒక రసాన్ని, లేక అనేక రసాలను చక్కగా పోషించగలగాలనేది వీరి దృఢాభిప్రాయం.

"రమణీయార్థ ప్రతిపాదక శబ్దం కావ్యం" . . . "వాక్యం రసాత్మకం కావ్యం..." ఉదాహరణలు ఒక రాష్ట్రంలో కరువు ఏర్పడింది. ప్రభుత్వం వాళ్ళు వివిధ పోషక పదార్థాలని తక్కువ పరిమాణంలో సంక్షిప్తకరించి చిన్ని చిన్ని ప్యాకెట్లలో పంచి ప్రజల ఆకలి బాధలను తీర్చగలిగారు. అన్ని విలువల కన్నా ఎక్కువ విలువలనే అందచేయ గలిగాయన్నమాట. అలా మహాకావ్య ప్రయోజనాల్ని సమర్థులైన కవులు మినీ కవితలలో కూడా సాధించవచ్చునన్నమాట. కాళోజి "జేపీ"

**పుటక నీది,**
**చావు నీది,**
**బతుకంతా దేశానిది**



"జేపీ" ఘనత కంటే గొప్పది కాళోజి కవిత.

**చంద్రసేన్ అనే యువకవి రాసిన కవిత:** "కన్ను తెరిస్తే జననం కన్ను మూస్తే మరణం రెప్పపాటే గదా ఈ ప్రయాణం" కళ్ళు తెరవటం, మూయటం అనే ప్రక్రియ వరుసగా సాగి పోతుందనేది భావం. ప్రజలను చైతన్యవంతులను చేయటమే లక్ష్యంగా ఎక్కువభాగం మినీ కవిత్వం వస్తున్నది. దేశ సమస్యలన్నింటికి అవినీతి మూలకారణంగా మినీ కవితను రాసే కవులు గుర్తించారు. మినీ కవితను ఒక ఆయుధంగా అందిస్తే వారిలో లోచూపు పెరుగుతుంది. ఈ దేశం పట్ల తమ వంతు బాధ్యత తెలిపివస్తుంది. మంచి మినీ కవితలను వ్రాయించవచ్చు. మంచి మినీ కవితలని అభిమానించేటట్లు చేయవచ్చు. భాషాడాంబరంగాని ఉండకపోవడం "సంక్లిష్టత" వీలైనన్ని తక్కువ పదాలలో, తక్కువ పాదాలలో వీలైనంత ఎక్కువ భావం ఉండేలా రాయడం. దీనినే 'నవ్య బంధూక శైలి' అంటున్నాము. మినీ కవితలలోని కవిత్వాన్ని పాఠకులు ఆలోచించి ఆస్వాదించే అవకాశం ఉన్నది. కనుక వాక్యంలాగా ఉన్నా సరే, ఏవో కొన్ని లైన్లుగా ఆ వాక్యం విడగొట్టబడినా సరే అది కవిత్వం కాదనటానికి వీల్లేదు. సాహిత్యంలో వచ్చే ప్రతి మార్పు కూడా ఏదో ప్రయోజనం కాంక్షించి మాత్రమే అభివృద్ధి చెందటానికి ప్రయత్నం చేస్తుంది. లయ లేక పోయిన, వాక్యం లాగా అన్పించిన పాఠకుల హృదయాలలో మంచి ఆలోచ నామృతాన్ని పెంపొందించగల్గితే మినీ కవితలో కవిత్వం ఉన్నట్లే. మినీ కవిత అనగానే సాధారణంగా తక్కువ లైన్లలో ఉండటం ఈ రెండు మాత్రమే గుర్తించాలి. మినీ కవితకు ముఖ్య లక్ష్యాలుగా సాధారణ, జపాన్ దేశంలో ఆవిర్భావించిన హైకూల తాత్విక పునాది జెన్ బౌద్ధం. హైకూల్లో 3 పాదాలు ఉంటాయి. మొదటి పాదాల్లో 5 రెండవ పాదంలో 7, మూడవ పాదంలో 5, మొత్తం 17 సిలబస్ (మాత్రలు) జపాన్ భాష అజంత భాష. హైకూల్లో 3 పాదాలలోను మొత్తం 17 స్వరాలు ఉంటాయి. హైకూలులో 3 పాదాల నియమాన్ని మాత్రం పాటిస్తున్నారు. మినీ కవితలో చెప్పిన విషయం సమాజానికి పనికొచ్చేదిగా ఉండాలి.

**ఆరుద్ర చెప్పిన మాటలు:**

ఎన్ని గజాలు రాశాడన్నది కాదు, ఎన్ని 'నిజాలు' చెప్పాడన్నది ముఖ్యం' ! అలా సాగిన డా. రంగారావుగారు 1116 లతో మినీ కవితలు సంకలనంగా రావటం హర్షదాయకం. మినీ కవిత గురించి ప్రచారం మానలేదు. 'మినీ కవిత శిల్ప సమీక్ష, మినీ కవితలలో మెనీ భావాలు' అనే సాహిత్య వ్యాసాల గ్రంథాలు ప్రచురించబడ్డాయి.

యువకులతో మినీ కవిత్వం వ్రాయించే సంవిధానాలు రూపొందించి కవిత్వ క్రీడలుగా మలచి మినీ కవితలు వ్రాయించడం ఒక ఉద్యమంగా అనేక పాఠశాలలు, కళాశాలలు తిరిగాడు. ఎన్నో మంచి మినీ కవితలు వ్రాసిన యువ కవులు, నవ కవులు వారందరి కవితలకు ఒక వేదికగా కూడ ఉపయోగపడుతుంది ఈ 'మినీ కవితల సంకలనం' అని అంటారు డా॥ రావి రంగారావు.

లబ్ధప్రసిద్ధ నుండి యువకవుల నుండి పరిశోధనకు పనికివచ్చే మంచి వెయ్యి నూట పదహారుల మినీ కవితల సంకలనం ఇది. ఇందుకు రావి రంగారావు అభినందనీయులు.



## "కవిత్వధార జమారా ప్రవాహం"

సజీవ కవిత నవనవంగా కలకాలం నిలచిపోతుంది. జమారా గారి కవితా స్పర్శ లలిత లలితంగా సాగుతూ రసహృదయంతో కూర్చిన భావాల సమాహారంగా మనకు దర్శన మిస్తాయి. పల్లెలన్నా, పల్లెవాసం అన్నా ఈ కవికి అత్యంత ప్రీతి. తన కవిత్వంలో పల్లీయుల సౌందర్యాన్ని గురించి పలుకవితలలో వ్యక్తపరుస్తారు. ప్రభుత్వోద్యోగిగా తాను రిటైరయిన తర్వాత కూడా ఏ పట్నంలోనో ప్లాటు తీసుకుని అందమైన భవంతిని నిర్మించుకొని నివాసముండక, మండల కేంద్రమయిన బోయినపల్లిలోనే స్థిరనివాసమేర్పరచుకొని తన శేష జీవితాన్ని పల్లెతల్లి ఒడిలోనే గడపాలన్న ఆకాంక్షను నెరవేర్చుకున్న ధన్యజీవి. పశు పక్ష్యాదుల సహజీవన మాధుర్యంతో, జనజీవన సమైక్య సౌందర్యతతో భరతఖండం సస్యశ్యామలంగా వర్ధిల్లాలనే ఆకాంక్షను 'శతాబ్దంలో లబ్ధి' కవితలో వ్యక్తపరుస్తారు. పేదరికం, ఆకలి, జమారా కవితా వస్తువులు. బడుగుజీవుల దయనీయ జీవనాన్ని దర్శిస్తారు. వారి ఆవేదనలకు ఆందోళన చెందుతూ దాన్నే తన కవితా నివేదనగా మలచి ఈ పుస్తకానికి ఊపిరి పోశారు. ఒక మహాకవి అన్నట్టు కష్టజీవికి ఇరువైపులా ఉండేవాడే కవి. జమారా ఆధునిక నాగరికత తెలివితేటలతో మనం మాత్రం అనాగరికంగా మారిపోవద్దంటూ మహాత్ముల ఆడుగుజాడల్లో నడుస్తూ భవిష్యత్‌ను బంగారుమయం చేసుకోవాలని ప్రభోదిస్తారు. 'భవిష్యత్ ఆశాకిరణం శీర్షికను. శ్రమిస్తే వంచనలను తృంచివేస్తే శ్రమయేవజయతే, విజయం మనదే అవుతుందంటారు. ఎక్కడో ఉరుముతున్నట్లు, ఎవ్వరో తరుముతున్నట్లు దిన దిన గండంగా మారిన జీవితాలను, ప్రపంచీకరణ నేపథ్యాన్ని ఈ కవి తన కవనంలో చక్కని ప్రతిస్పందనలను కళ్ళకు కట్టినట్లు చూపిన కవితలు ఉన్నాయి. హృదయాలను హత్తుకుంటాయి. సంకలనంలోని కవితలన్నీ ఆయన హృదయవేదనకు ప్రతిబింబాలు, వర్షించే చినుకులు గురించి, శ్రమ విలువ గురించి, గెలుపు-ఓటముల గురించి, బతుకమ్మ గురించి, అమ్మ గురించి, ప్రకృతి, బాల్యం సునామీ, ఉగాది, తెలంగాణ, స్నేహం మొదలైన అంశాల గురించి ఈ సంకలనంలో వైవిధ్య భరితమైన కవితాలు వ్రాశారు. 'జమారా' గారికి పరిచయం లేని సంస్థ ఆంధ్రప్రదేశమే కాక అటు మహారాష్ట్ర చెన్నై, కర్ణాటక, రాష్ట్రాల తెలుగువాళ్లకు ముఖ్యంగా తెలుగు కవులందరికీ పరిచితులే. వీరి భక్తి జానపద,

ఆడియో కేసెట్స్ పవిత్ర ధర్మపురి, వేములవాడ, కాళేశ్వరం, పుణ్యక్షేత్రాలలో క్యాసెట్స్ షాపులలో పాటలహోరులో మధురంగా విన్పిస్తాయి. భావాలతో అభిరుచి ఉన్న వారికి తన అభిరుచి ననుసరించి తపన తీర్చుకోవడానికి ఎన్నో మార్గాలు దొరకుతాయి. ఆ మార్గములోనే శ్రీ నమిలికొండ జగన్ మాధవరావు గారు కవిత్వాధ్యయనమును చేస్తూనే తన కవితా మార్గమును ఏర్పరచుకొని తన మార్గమును ఫలవంతమును చేసుకుంటున్నాడు. కవిత్వములో ధార ఉంది. విషయ సృష్టీకరణ ఉంది. అభ్యుదయ భావనలు ఉన్నాయి. ఈ భావనలలోంచి ఆయన నిక్కమైన కవిత్వమును అందించే ప్రయత్నం చేసారు. కవిత్వ స్పృహ కలిగిన జీవితం ఆయనది. 'జమారా కవితాధార' పవిత్ర తరంగిణిలా, సత్య విపంచిగా, విషయ పరిజ్ఞానం, అనుభవసారం చవిచూపించాలనీ, ఆత్మీయతా అనుబంధంతో నేనూ మనంలో సమైక్యమై వుండాలనీ ఆకాంక్ష తెలిపాను. జనం మనం అంతా ఉద్యస్ఫూర్తి పెంచుకునీ నడుంబిగిస్తేనే మనకవసరమైనవన్నీ. అదే ధారసాగాలి - సాగాలి.



## జీవనరేఖలు

| | | |
|---|---|---|
| పేరు | : | నమిలికొండ బాలకిషన్‌రావు |
| జననం | : | 06-09-1950, పూడూరు, కరీంనగర్ జిల్లా |
| తల్లిదండ్రులు | : | శ్రీమతి రత్నాబాయి, శ్రీనారాయణరావు |
| విద్యార్హతలు | : | యం.ఏ., యల్‌యల్.బి. |
| వృత్తి | : | అడ్వకేట్, రిజిస్ట్రేషన్ వ్యవహారాలు |
| సహధర్మచారిణి | : | శ్రీమతి గోకులరాణి |
| సంతానం | : | శ్రీమతి కవితాభరద్వాజ్, డా॥ పాంచాలరాయ్, హరిత |
| రచనలు | : | యువస్వరం (కవితాసంపుటి) 1981 |
| | | అక్షరచిత్రాలు (సాహితీ మిత్రులపై కవితా చిత్రాలు) 1986 |
| | | శాంతి-సమత (కవితాసంపుటి) 1989 |
| | | అక్షరాల్లో అనంతం (కవితా సంపుటి) 1990 |
| సంపాదకుడు | : | ప్రసారిక (ఆధునిక సాహిత్యవేదిక) మాసపత్రిక 1982 నుండి మావిరసం (కవితా సంకలనం) 1990 |
| | | "నివాళి" కాళోజి రామేశ్వరరావుగారి స్మృతి సంచిక, 1997 సుక్కపొడుపు (ప్రసారిక ప్రత్యేక సంచిక) 2002 |
| | : | అధ్యక్షుడు, సాహితీ సమితి, వరంగల్లు అనేక సంస్థలలో భాగస్వామ్యం |

: "యువస్వరం" కవితా సంపుటిపై 12గురు రాసిన వ్యాసాల సమాహారం "నమిలికొండ బాలికిషన్‌రావు - కవితాదర్పణం" - టి. శ్రీరంగస్వామి సంపాదకత్వంలో

: కాలం వెంట నడచివస్తున్న... (నమిలికొండ బాలకిషన్‌రావు అభినందన సంచిక) ప్రచురణ శ్రీలేఖ సాహిత్య వరంగల్లు రజతోత్సవాల సందర్భంగా డా.టి. శ్రీరంగస్వామి.

: "శాంతి-సమత" తెలుగు కవితా సంపుటిని డా. రేగులపాటి మాధవరావుగారు అదే పేరుతో హిందీలోకి అనువాదం చేసినారు.

: కొన్ని కవితలు శ్రీ షరీఫ్ ఇమామ్ గారిచే ఉర్దూలోకి అనువాదం.

చిరునామా : ఇ.నెం. 6-7-61, రాగన్నదర్వాజ, హన్మకొండ,
వరంగల్లు - 506 011 ఫోన్: 0870-2447407